ప్రపంచ తెలుగు మహాసభ ప్రచురణ :

# తెలుగు పండుగలు

రచయిత :

శ్రీ. తిరుమల రామచంద్ర



ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ

సైఫాబాద్,

హైదరాబాద్. 500004.

# ముందుమాట

ఎన్నో ఏళ్లుగా అనుకొంటున్న ప్రపంచ తెలుగుమహాసభలు జరుగనున్న పర్వ సమయం ఆసన్నమవుతున్నది. ప్రపంచంలోని తెలుగువారి ప్రతినిధు లందరిని ఒకచోట సమీకరించవలెనని పెద్దలందరూ కన్నకలలు ఫలిస్తున్న శుభ సమయమిది. రాబోయే ఉగాది రెండువేల అయిదువందల సంవత్సరాల తెలుగు జాతి చరిత్రలో మరపురాని మధుర ఘట్టము కాగలదు.

క్రీస్తుపూర్వం మూడవ శతాబ్దికిచెందిన శాతవాహన రాజుల కాలంనుండి తెలుగు ప్రజలకు ఒక విశిష్టమైన చరిత్ర ఉన్నది. భారతదేశంలో తెలుగు మాట్లాడే ప్రజలు దాదాపు ఐదుకోట్లకు పైగా ఉన్నారు. హిందీ మాట్లాడేవారి తరువాతి స్థానం తెలుగువారిదే. బౌద్ధపూర్వయుగంనుంచి ఇటీవల బ్రిటిష్ సామ్రాజ్య పరిపాలనాయుగం వరకూ తెలుగువారు పెద్దఎత్తున ప్రపంచం నలు మూలలకూ వలస వెళ్లడం జరిగింది. అట్లా వెళ్ళిన తెలుగువారు తమ భాషా సంస్కృతి సంప్రదాయాలను ఆయా జాతీయ జీవన విధానాలతో మేళవించి, వాటిని సుసంపన్నం చేస్తూఉన్నారు.

ప్రపంచ తెలుగు మహాసభల ప్రధాన లక్ష్యం తెలుగు ప్రజల, తెలుగు అభిమానుల ప్రతినిధులను ఒక వేదికమీద సమావేశపర్చడం. జాతీయ, అంతర్జాతీయ సాంస్కృతిక రంగాలలో తెలుగువారు చేయవలసిన కృషినిగూర్చి చర్చించి, నిర్ణయించుకోవడానికి, తద్వారా వివిధ చైతన్యస్రవంతులను ఏకోన్ము ఖంచేసి మన సాంస్కృతిక సంబంధాలను దృఢతరం చేసుకోవడానికి ఈ మహా సభలు దోహదకారులు అవుతవి. అంతేకాక ఈ మహాసభలు ఆర్ద్రమైన భావ సమైక్యతకు ప్రాతిపదికలై తెలుగు జాతిని సమైక్యం చేయగలవనీ, ఆవిధంగా జాతీయ అభ్యుదయానికి తోడ్పడగలవనీ విశ్వసిస్తున్నాను.

1975 ఏప్రిల్ 12వ తేదీన తెలుగు ఉగాది రోజున ప్రారంభమై ఒక వారం రోజులుపాటు జరిగే ఈ మహాసభలలో వివిధ దేశాలనుంచీ, వివిధ రాష్ట్రాలనుంచీ, యునెస్కోవంటి అంతర్జాతీయ సంస్థలనుంచి విచ్చేసి ప్రముఖులు ప్రతినిధులుగానో, పరిశీలకులుగానో పాల్గొంటారు. ఈ మహాసభల సమయంలో

చర్చాగోష్ఠులు, ప్రదర్శనలు, ప్రచురణలు మొదలైన కార్యక్రమాలు జరుగుతాయి. దేశ విదేశాలలోని తెలుగువారి సంస్కృతి, తెలుగు భాషా సాహిత్యాల కళల అభివృద్ధి వైజ్ఞానిక సాంకేతిక ప్రగతి మొదలైన విషయాలపై చర్చాగోష్ఠులు జరుగుతవి. తెలుగువారి సాంస్కృతిక వైభవాన్ని వివిధ కోణాలనుంచి ప్రస్ఫుటంచేసే ఒక ప్రదర్శన ఏర్పాటు అవుతున్నది. తెలుగువారి సమగ్ర స్వరూపాన్ని సందర్శించడానికి వీలైన సంగ్రహాలయాన్ని (మ్యూజియంను) స్థాపించడానికి ఈ ప్రదర్శన బీజభూతమవుతుంది. తెలుగువారి సంస్కృతిని నిరూపించే సాంస్కృతిక కార్యక్రమాలు వారం రోజులపాటు సాగుతవి. తెలుగు ప్రజల సంస్కృతి సంప్రదాయాలను విశదంచేసే ప్రత్యేక సంచికలు తెలుగు, ఇంగ్లీషు, హిందీ, ఉర్దు భాషలలో విడుదల అవుతాయి. ఈ కార్యక్రమాలలో భాగమే ఈ గ్రంథ ప్రచురణ.

తెలుగు ప్రజలు భాష, సాహిత్యం, చరిత్ర, సంస్కృతి, కళలు మొదలైన వివిధ రంగాలలో సాధించిన ఘనవిజయాలను విశదంచేసే గ్రంథాలు అనేకం ఈ మహాసభల సమయంలో విడుదల అవుతాయి. ఈ గ్రంథాలను రచించి, సకాలంలో మాకు అందించిన రచయితలందరకూ నా కృతజ్ఞతలు. ఈ గ్రంథాలను ప్రచురించే భారం వహించడానికి ముందుకు వచ్చిన అకాడమీ అధినేతలను అభినందిస్తున్నాను. తెలుగువారి విశిష్టతలను విశదంచేసే ఈ గ్రంథాలు సహృదయు లందరి ఆదరణ పొంద గలవని విశ్వసిస్తున్నాను. అయితే, ఇంత మాత్రం చేతనే ప్రపంచ తెలుగు మహాసభల ఆశయాలు సఫలం కాగలవని నేను అనుకోవడంలేదు. చేయవలసినది ఇంకా ఎంతో ఉంది. ఈ మహాసభల సందర్భంగా నెలకొల్పబడనున్న 'అంతర్జాతీయ తెలుగు విజ్ఞాన సంస్థ' మహాసభల ఆశయ సాధనకు పూనుకొనడమే కాక జాతీయ, అంతర్జాతీయ సాంస్కృతిక సంబంధాలను దృఢతరం చేయగలదని నమ్ముతున్నాను.

జలగం వెంగళరావు
అధ్యక్షులు
ప్రపంచ తెలుగు మహాసభలు

—:(o):—

# పరిచయము

సహస్రాబ్దాలుగా ప్రవర్ధమానమగుచున్న తెలుగు సంస్కృతిని తెలుగుదేశపు నలుచెరగుల పరిచితము చేయు సంకల్పములో 1975 వ సంవత్సరమును తెలుగు సాంస్కృతిక సంవత్సరముగ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము ప్రకటించినది. అందుకు అనుగుణమైన కార్యక్రమాలను నిర్వహింప జేయుటయేగాక, ప్రపంచములోని వివిధదేశాలలో వసించుచున్న తెలుగువారి సాంస్కృతిక ప్రతినిధులందరును ఒకచోట సమావేశమగు వసతిని కల్పించుటకై 1975, ఏప్రిల్ 12 (తెలుగు ఉగాది) మొదలుగ ప్రపంచ తెలుగు మహాసభ హైదరాబాదున జరుగు నటుల ప్రభుత్వము నిర్ణయించినది. అందుకు ఒక ఆహ్వానసంఘము ఏర్పాటయినది. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ముఖ్యమంత్రి మాన్యశ్రీ జలగం వెంగళరావుగారు ఆ సంఘమునకు అధ్యక్షులు; విద్యాశాఖామంత్రి మాన్యశ్రీ మండలి వెంకట కృష్ణారావుగారు దాని కార్య నిర్వాహకాధ్యక్షులు; ఆర్థికమంత్రి మాన్యశ్రీ పిడతల రంగారెడ్డిగారు ఆర్థిక సంస్థా కార్యక్రమాల సమన్వయ సంఘాల అధ్యక్షులు.

ఆ సంఘము, ప్రపంచ తెలుగు మహాసభల సందర్భమున వచ్చు వారికి తెలుగుజాతి సాంస్కృతిక వైభవమును తెలియజేయుటకు అనువుగ ఆంధ్రభాషా సాహిత్య, కళా చరిత్రాదికములను గురించి ఉత్తమములు, ప్రామాణికములునగు కొన్ని లఘు గ్రంథములను ప్రకటించవలెనని సంకల్పించి, ఆ కార్యనిర్వహణకై 44 మంది సభ్యులు కల ఒక విద్వత్సంఘమును, శ్రీ నూకల నరోత్తమరెడ్డిగారి అధ్యక్షతన నియమించినది ఆ విద్వత్సంఘము ఆ లఘు గ్రంథముల ఎన్నువుల నిర్దేశించి వాని రచనకై ఆయా రంగములందు పేరుగనిన ప్రముఖులను రచయితలుగ యెన్నుకొనినది. ఈవిధముగ సిద్ధమైన గ్రంథములలో భాషా, సాహిత్య, చారిత్రక విషయములకు సంబం

ధించిన వానిని ప్రకటించు బాధ్యతను ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వహింప వలసినదిగ ప్రపంచ తెలుగు మహాసభాకార్యనిర్వాహకాధ్యక్షులు మాన్యశ్రీ మండలి వెంకట కృష్ణారావుగారు అకాడమీని కోరిరి. మహాసభా సఫలతకొరకై కృషి చేయు సంకల్పముతో ఈ బాధ్యతను వహించుటకు అకాడమీ సంతోషముతో అంగీకరించినది.

ఆ విధముగ ప్రకటింపబడిన గ్రంథశ్రేణిలో ఈ "తెలుగు పండుగలు" అను గ్రంథమును, రచించిన శ్రీ తిరుమల రామచంద్ర గారు ఆంధ్ర పాఠకలోకమునకు సుపరిచితులు. వారికి మేము కృతజ్ఞతాబద్ధులము. గ్రంథమును నిర్దుష్టముగ, చక్కగ ముద్రించిన లళితా ప్రెస్ వారికి మా కృతజ్ఞత.

హైదరాబాదు,
తేది : 15-3-75

దేవులపల్లి రామానుజరావు
కార్యదర్శి
*ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి*

# విషయ సూచిక

# తెలుగు పండుగలు

## ఉగాది

ఉగాది మనకు ముఖ్యమైన మొదటి పండుగ. దీనితో మన నూతన సంవత్సరం ఆరంభమవుతుంది. ఇది మనకేకాక చాంద్రమానం అనుసరించే కర్నాటకులకు, మహారాష్ట్రులకు మాళవదేశీయులు మొదలయినవారికికూడ సంవత్సరాది. ఇది చైత్రశుద్ధ పాడ్యమి నాడు వచ్చును.

ఉగాది అనే మాట విచిత్రంగా కనిపిస్తుంది. నిజానికి ఇది యుగాది, అంటే, నూతన యుగానికి, నూతన కాలానికి ఆది అని అర్థం. తెలుగు యుగాది క్రమంగా ఉగాది అని వాడుకలోకి వచ్చింది. కర్నాటకులు, మహారాష్ట్రులు దీనిని యుగాది అనే వ్యవహరిస్తారు. యుగం అంటే ఒక కాల విభాగము. వైశాఖ శుద్ధ తృతీయనాడు కృతయుగము, కార్తిక శుద్ధ నవమినాడు త్రేతాయుగము, భాద్రపద బహుళ త్రయోదశినాడు ద్వాపరయుగము, మాఘ బహుళ అమావాస్యనాడు కలియుగము ప్రారంభమవుతాయని, చంద్ర సూర్య గురువులకు కొన్ని నక్షత్రములతో సంబంధము కలిగినప్పుడు యుగాదులు ఏర్పడుతాయని విష్ణు పురాణ భారతాదులు చెప్పుతున్నాయి. ఈ యుగాదులలో మానవులు స్నానంచేసి, పూజా పురస్కారాలు చేసి, దానధర్మాలు చేసి, జపతపాదులు చేసి పుణ్యఫలం పొందాలని మహాభారతం చెబుతున్నది. దీనిని బట్టి యుగాది- ఒక సమయానికి మొదలయిన దినం- ఒకటి పూర్వం కూడ పండుగదినంగాను, పర్వదినంగాను భావించబడేదని స్పష్టమవుతున్నది. ఆ యుగాదినే మన మిప్పుడు సంవత్సరాదిగా పండుగ చేసుకొంటున్నాము.

ఈ సంవత్సరాది నిర్ణయమూ మన పురాణేతిహాసాలలో అనేక విధాలుగా ఉంది. ఒకప్పుడు ఆశ్వయుజ పూర్ణిమ, ఆశ్వయుజ అమావాస్య, కార్తిక పూర్ణిమ, మార్గశిర సంక్రాంతి, పుష్య సంక్రాంతి, మాఘ పూర్ణిమ, మాఘ బహుళాష్టమి వసంత పంచమి, ఫాల్గుణ పూర్ణిమ - హోలీ పండుగ, చైత్రశుద్ధ పాడ్యమి,

వైశాఖ పూర్ణిమ- ఇలా పెక్కు విధాలుగా ఉంది. దీనికి కారణము ఋతు పరివర్తనము. వసంతకాలమున ప్రకృతిలో నవచైతన్యము మోసులెత్తుటను బట్టి, ఈ కాలమే నూతన సంవత్సరారంభమని పూర్వులు అభిప్రాయపడినారు. క్రీస్తుశకం నాల్గవ శతాబ్దములో ఉన్న జ్యోతిర్వేత్త వరాహమిహిరాచార్యుడు వసంతవిషువత్కాలము వివిధ నక్షత్రములకు చలించి అశ్వినీ నక్షత్రాదిలో సంభవించుట గ్రహించి, మన ప్రాచీన దేవమాన దిన ప్రారంభకాలమైన ఉత్తరాయణ పుణ్యకాలాదే వసంత కాలమని వసంత విషువత్కాలం నిర్ణయించి, మాస ఋతుసామరస్యం సాధించి సంవత్సరాది వసంతకాలంలోనే అని నిర్ణయించినాడు. అప్పటినుంచి చైత్రమాసమే సంవత్సరాదిగా పరిగణిస్తున్నాము.

చైత్రమాసంలో ఏదో ఒకనాడు ఈ పండుగ రాకూడదా, పాడ్యమినాడే ఎందుకు ?— అనే సంశయం కలుగవచ్చు. దీనికి కొంత చర్చ అవసరం. పూర్వము పూర్ణిమనుంచి పూర్ణిమకు నెల లెక్కకట్టు ఆచారమూ ఉండినది. అమావాస్య నుంచి అమావాస్యకు నెలలెక్కకట్టడమూ ఉండేది. ఈ విషయమును నిర్ణయ సింధుకారుడైన కమలాకరభట్టు చాల చర్చించాడు. చంద్రగతితో నెల లెక్కపెట్టడం సులభం గనుక, అది అనాదిగా వున్నందున, శుక్లపక్షాదితో నెల లెక్క పెట్టాలని నిర్ణయించాడు. ఇంతేకాక భాస్కరాచార్యుడు సిద్ధాంత శిరోమణి అనే గ్రంథంలో సూర్యుడు చైత్రమాస శుక్లపక్ష పాడ్యమినాడు లంకానగరంలో ఉదయించడంవల్ల-అనగా భూమధ్యరేఖపై ఉండడంవల్ల-ఆనాడే యుగ, దిన, మాస, వర్షారంభం అవుతుందని నిర్ణయించాడు. ఇలాటి నిర్ణయమయిన తర్వాత హేమాద్రి మొదలయిన వారు "బ్రహ్మ ఈ జగత్తును చైత్రమాసంలో శుక్ల పక్షంలో మొదటి దినాన, సూర్యోదయ వేళ సృష్టించినాడు. గ్రహ నక్షత్ర ఋతుమాస వర్ష వత్సరాధిపతులను ప్రవర్తింపజేసినాడు" అని ఆస్తికులకు బోధించినారు; పండుగ చేసుకొనే పద్ధతిని వివరించినారు

ఈ ఉగాది పండుగనాడు తెలుగువారు ఉషఃకాలంలోనే మంగళాభ్యంగ స్నానం చేసుకొంటారు. సంపన్నులైనవారు క్రొత్త బట్టలు కట్టుకొంటారు ఇండ్ల తలవాకిలికి, తక్కిన వాకిళ్లకు మామిడాకుల తోరణాలు పూవుల తోరణాలు కడుతారు; ఇంటి భవంతిని అలికి ముగ్గులు పెట్టి మంటపం నిర్మించి ఆ సంవత్సరం నూతన పంచాంగాన్ని ఆ సంవత్సరాధిదేవతను షోడశోపచారాలతో పూజిస్తారు. పిండివంటలను, ఉగాది పచ్చడిని భగవంతునికి నివేదించి ఆరగిస్తారు. ఉగాది

పచ్చడికి ఉగాది గొజ్జు అని కూడ పేరు. ఇది ఈ దినం చాల ముఖ్యం. వేపపూత, మామిడి ముక్కలు, కొత్తబెల్లం, కొత్తచింతపండు, పచ్చిమిరపకాయ ముక్కలు, ఉప్పు, గసగసాలు మొదలైన వాటిని కలిపి ఈ పచ్చడి సిద్ధపరుస్తారు. దీనికి నేయి తిరగబోత చేయడమూ కద్దు. షడ్రసోపేతమైన ఈ రసాయనము సుఖదుఃఖ మిశితమైన మానవుని సంవత్సర జీవితానికి ప్రతీక. సంవత్సరమంతా కలుగనున్న సుఖదుఃఖాలను మానవుడు ఆనాడే చవిచూడడం ఆరంభిస్తాడని దీని భావం. దీనిలో నేయి కలపడం, మానవుడు సుఖదుఃఖాలకు అంటకుండా వుండాలనడానికి సూచన ఇలాంటి రసాయనం సేవించిన తర్వాత, ఇష్టజనంతో మృష్టాన్నం భుజిస్తారు.

భోజనానంతరం మూడు జాముల తర్వాత, స్వగృహంలోనో, గ్రామ దేవాలయంలోనో, గ్రామం చావడిలోనో, జనమంతా చేరి పంచాంగశ్రవణం చేస్తారు. ఆ సంవత్సరం తమకు జరిగే యోగాలను, కందాయఫలాన్ని, ఆయవ్యయాలను, రాజపూజ, రాజావమానాలను పంచాంగంద్వారా తెలుసుకొని, తదనుగుణంగా ప్రవర్తించడానికి ఆనాడే సంకల్పించుకొంటారు. కొన్ని ప్రాంతాలలో ఉగాదినాటి సాయంకాలం ఎడ్లబండిపోటీ జరుపడం ఉంది, ధర్మసింధు, నిర్ణయసింధు. భవిష్యపురాణము మొదలయిన ధర్మశాస్త్ర గ్రంథాలు "సంవత్సరారంభ దినం ఉదయం తలంటి పోసుకొని, నూతన సంవత్సరం నామకీర్తనం చేసి. ప్రతి ఇంటిమీద ధ్వజాలు పెట్టాలి. వేపాకు తినాలి సంవత్సరాది ఫలం వినాలి వసంతనవరాత్రం ప్రారంభించాలి." అని శాసించినాయి. ఈనాడు ఇంద్రోత్సవం చేయాలని భారతం చెబుతున్నది. రామభక్తులు ఈ సంవత్సరాది నుంచే శ్రీరామనవమి ఉత్సవాలు ప్రారంభించి, చైత్రశుద్ధ దశమినాడు పట్టాభిషేకంతో ముగిస్తారు వీటిని రామ నవరాత్రోత్సవాలు అంటారు.

చాంద్రమాన సంవత్సరాది అతిప్రాచీనమైనదని మన పురాణాలు, ధర్మశాస్త్రము చెబుతున్నవి. సౌర బార్హస్పత్యమానాలు పాటించేవారూ వేదవిహిత కర్మలను ఆచరించడానికి చాంద్రమానమే అనుసరిస్తారు. అగ్ని పూజకులైన పార్శీల సంవత్సరాది "నౌరోజ్" దాదాపు మన ఉగాది దరిదాపులలో రావడం వల్ల కూడ మన చాంద్రమాన సంవత్సరాది అతిప్రాచీన మనడానికి మరొక నిదర్శనం.

సౌరమానమును మన దేశంలో తమిళ, కేరళ, వంగ, పంజాబు, సింధు, అస్సాం వాసులు పాటిస్తారు. చాళుక్యుల పరిపాలన కాలంలో తెలుగు నాట సౌరమానం వాడుకలో ఉండేది. బార్హస్పత్యమానాన్ని నేడు గుజరాతు, రాజస్థానాది ప్రాంతాలు పాటిస్తాయి.

# శ్రీరామ నవమి

శ్రీరామనవమి చైత్రశుద్ధ నవమినాడు ఆచరించబడుతుంది రామకృష్ణులు మహావిష్ణువు సంపూర్ణావతారాలని మన పురాణేతిహాసాలు ఉద్ఘోషిస్తున్నాయి సీతారామ లక్ష్మణులను మనకు అన్నివిధాల ఆదర్శప్రాయులుగా మనదేశ ప్రజ లందరూ కొలుస్తున్నారు. పాతివ్రత్యానికి సీతమ్మను, పితృవాక్యపరిపాలనకు ఏకపత్నీవ్రతానికి, సత్యసంధతకు, పరాక్రమానికి శ్రీరాముని, భ్రాతృప్రీతికి. పరదార విముఖతకు లక్ష్మణుని మన దేశవాసులు ఆదర్శంగా స్వీకరిస్తున్నారు వీరి గుణగణాల ప్రశంస అయిన రామాయణము మనకు ఆదికావ్యమై భారత దేశంలోని అన్నిభాషల సాహిత్యాలను ప్రభావితంచేసింది. జైన బౌద్ధమత గ్రంథాలలోని రామాయణ కథలు, కావ్యాలు వాల్మీకి రామాయణంతో కొన్ని ఘట్టాలలో భేదిస్తున్నా, రామలక్ష్మణ సీతల గుణగణాల వర్ణనంలో భేదించడం లేదు. రామాయణగాథ అతిప్రాచీన మనడానికి అమెరికాలోని రెడ్ ఇండియను జాతిలో ఏడాది కొకమారు సీతారామోత్సవం జరపడం, వారి పాటలలో సీతారాముల పాటలుండడం మరొక నిదర్శనం.

తన శీలసంపదతో మానవజాతికే ఆదర్శప్రాయుడైన రాముడు శ్రీరామ నవమినాడు అవతరించినట్టు వాల్మీకి రామాయణం తెలుపుతున్నది. "పుత్ర కామేష్టి పూర్తిఅయిన తర్వాత ఆరు ఋతువులు నడిచాయి. పిదప, పన్నెండో నెల అయిన చైత్రమాసంలో నవమి తిథినాడు, పునర్వసు నక్షత్రంలో, కటక లగ్నంలో గురు చంద్రులుండగా, ఐదు గ్రహాలు ఉచ్చస్థానంలో ఉండగా, కౌసల్యాదేవి రామచంద్రుని ప్రసవించింది" అని వాల్మీకి తెలిపినాడు.

రామనవమినాడు ఉపవాసంచేసి, పూజా పురస్కారాలు జరిపి, రాత్రి జాగరణ చేయవలెనని వ్రతగ్రంథాలు తెలుపుతున్నాయి. రామనవమినాడు

ఉపవాస జాగరాలు చేసి, దశమినాడు భక్తితో రాముని పూజించి, రామ భక్తులకు దానం చేయాలని, అన్ని వ్రతాలలోను రామనవమివ్రతం ఉత్తమోత్తమం గనుక దీనిని విడువరాదని ధర్మశాస్త్రవ్రతగ్రంథాలు తెలిపాయి.

చైత్రశుద్ధ పాడ్యమి నుండి రామనవరాత్రోత్సవాలు జరుపుతారు. ఈ తొమ్మిది దినాలు పగలు వాల్మీకి రామాయణము, రాత్రి రామకథా కాలక్షేపాలు జరుపుతారు. నవమినాడు రామజనన ఘట్టం చదివి పూజలు చేస్తారు. పానకము, పన్యారము (వడపప్పు) ఆరగింపు పెట్టి, అతిథులకు ప్రసాదంగా పంచుతారు. దశమినాడు రామపట్టాభిషేకఘట్టము చదివి పట్టాభిషేకోత్సవం చేస్తారు, సీతా రామ కల్యాణము జరుపుతారు. ఈ కళ్యాణము భద్రాద్రి మొదలైన దేవాలయా లలో నవమినాడు మహావైభవంగా జరుపుతారు కొన్ని ప్రాంతాలలో వసంత నవరాత్రోత్సవం అనే పేర దేవీ నవరాత్రోత్సవం జరిపి దేవీపూజ చేయడమూ ఉంది. కొందరు రామ రామ అని రామకోటి ప్రారంభించి దానిని మరుసటి సంవత్సరం రామనవమికి ముగించి పూజాదులు సంతర్పణలు జరుపుతారు

మన దేశాన్ని అనాది కాలం నుంచి ఒక్కటిగా చేస్తున్నది రాముడు, అతని చరిత్ర, రామకథను ఆ బాలవృద్ధము అందరూ ఎంతో కొంత తెలుసుకొని వుంటారు. దేశాన్ని ఏకం చేసిన రామకథ శాశ్వతంగా వుంటుందని మన దేశ వాసుల విశ్వాసం కనుకనే భారత జాతిపిత అయిన గాంధీజీ స్వరాజ్యం సాధించిన తర్వాత రామరాజ్యం స్థాపించాలని ఉపదేశించాడు. రామరాజ్యమంటే- గాంధీజీ ఆశయం- అందరికీ జీవితావసరాల సౌకర్యాలు కలిగించడం, అందరి అభివృద్ధికీ అవకాశాలు కల్పించడం, సత్యధర్మనిష్ఠతో, ప్రజలు, పాలకులు ప్రవర్తించడమూ నని మనం గ్రహించవచ్చు



# హనుమజ్జయంతి

హనుమంతుడు స్వామిభక్తికిని, కార్యసాధనకును పెట్టినది పేరు. ఇతడు లంకాదహనము చేసి, సీతావృత్తాంతము తెచ్చినందున "చూచి రమ్మంటే కాల్చి వచ్చాడు" అని కార్యసాధకులను ప్రశంసించే సామెత ఏర్పడింది. హనుమంతుని జయంతి చైత్రశుద్ధ పౌర్ణమినాడు జరుపుతారు. కొందరు శ్రీరామనవమితోపాటు హనుమజ్జయంతిని జరుపడం కూడ కద్దు.

హనుమంతుడు కేసరి అనే వానరరాజుకు అంజనాదేవి అనే వానరకాంతకు పుట్టినవాడు. ఇతని జననం విషయంలో ఒక విచిత్రగాథ ఉంది. అంజనాదేవి పూర్వజన్మలో పుంజిక అనే అప్సరస. శాపవశాన మరుజన్మలో వానరస్త్రీ అయింది. ఆమె ఒకనాడు వనంలో విహరిస్తుండగా గాలికి పైట తొలగి, పాలిండ్లు బైటపడినవి. వాయుదేవుడు వాటిని చూచి మోహావేశంతో ఆమెను కౌగిలించుకోగా, ఆంజనేయుడు జన్మించాడు.

ఆంజనేయుడు ఇంకను బాలుడుగా ఉండగా అంజనాదేవి ఒకనాడు ఉదయం పండ్లు తేపడానికి అడవికి పోయింది. ఆకలిగొన్న ఆంజనేయుడు మంకెన పూవువలె ఎఱ్ఱగా ఉన్న సూర్యబింబాన్ని మింగడానికి అవైపు ఎగిరాడట! సూర్యుని మింగడానికి అప్పుడే వస్తున్న రాహువు అతనిని చూచి భయపడి వెనుకకు మళ్ళి, ఇంద్రునికి ఈ సంగతి చెప్పాడు. ఇంద్రుడు ఐరావతం ఎక్కి వచ్చినాడు. ఆంజనేయుడు ఐరావతాన్ని చూచి ఇదేదో కొత్త పండనుకొని దానిని మింగబోయినాడు. ఇంద్రుడు వజ్రంతో హనుమంతుని కొట్టినాడు. హనుమంతుడు ఆ దెబ్బకు ప్రాణాలు వదలి, ఒక కొండపై పడగా, అతని ఎడమ దవడ (హనువు) పగిలింది. దీని వలననే అతనికి హనుమంతుడు– గాయపడిన దవడ గలవాడు– అని పేరు వచ్చింది. వాయుదేవుడు తన కుమారునికి కలిగిన విపత్తునకు కోపించి అతనిని ఎత్తుకొని ఒక కొండగుహలో దూరినాడు. ప్రపంచమంతా ప్రాణంలేక స్తంభించి పోయింది. దేవతలు బ్రహ్మతో మొరపెట్టినారు. అతడు తన దివ్య దృష్టితో సంగతి గ్రహించి, దేవతలు వెంటరాగా వాయువున్న గుహకుపోయి, హనుమంతుని బ్రతికించి, అతనికి చిరంజీవి అయ్యేటట్టు వరమిచ్చినాడు.

ఇంద్రుడు ఒక పద్మమాలను బహూకరించినాడు; అది ఎప్పుడూ వాడనిది. ఈశ్వరుడు "అవధ్యుడివి కమ్ము!" అని వరమిచ్చినాడు. వాయుదేవుడు ప్రసన్నమైనాడు; ప్రపంచం మరల ఊపిరి తీసుకొంది.

హనుమంతుడు పెద్దవాడైన తర్వాత బలగర్వంతోను, వరగర్వంతోను ఆగడాలు చేస్తూ, మునులను హింసించసాగినాడు. మునులు అతడు అవధ్యుడు గనుక, "నీకు నీ బలము తెలియకపోవుగాక! నిన్ను పొగడితేగాని, నీ బలం పెరుగకుండా ఉండనీ!" అని శాపమిచ్చారు. దానితో అతని ఆగడాలు తగ్గినవి. హనుమంతుడు సూర్యునివద్ద విద్యాభ్యాసం చేసినాడట. తర్వాత సుగ్రీవునికి మిత్రుడై మంత్రి అయినాడు. రాముని కార్యం సాధించినాడు.*

హనుమజ్జయంతి ద్వైత సంప్రదాయంవారికి ముఖ్యమయిన పండుగ. వారు హనుమంతుని 'ముఖ్యప్రాణదేవుడ'ని అంటారు. హనుమదుపాసకులు గూడ ఈ పండుగను గొప్పగా చేస్తారు హనుమంతుని దేవాలయాలలో ఉత్సవాలు, రథోత్సవాలు జరుగుతాయి. సుందరకాండ పారాయణం జపహవం, శాంతి మొదలయినవి జరుపుతారు. రామునితో పాటు రామకార్యాన్ని చిత్తశుద్ధితో చేసిన హనుమంతుడు మనకు ఆదర్శపురుషుడుగ దేవతగా అయినాడు.

"మనోజవం మారుత తుల్యవేగం<br>
జితేంద్రియం బుద్ధిమతాం వరిష్ఠమ్,<br>
వాతాత్మజం వానర యూథ ముఖ్యం<br>
శ్రీ రామ దూతం శిరసా నమామి."

---

* హనుమంతుడు వానరజాతిలో విద్వాంసుడుగా కనబడుచున్నాడు. ఇతడు వ్యాకరణమునందు దిట్టయట. శ్రీరాముడతని వాగ్వైఖరిని మెచ్చు కొన్నట్లు శ్రీమద్రామాయణములో కలదు.

నూనం వ్యాకరణం కృత్స్నమ్ అనేన బహుధా శ్రుతమ్<br>
బహు వ్యాహరతానేన నకించి దపశబ్దితమ్

శ్రీమద్రామాయణం, కిష్కింధాకాండ.

# అక్షయ తృతీయ

అక్షయతృతీయ పండుగ వైశాఖ శుద్ధ తృతీయ నాడు జరుపుతారు. ఈ తిథినాడు కృతయుగం ఆరంభమయినదని విష్ణుపురాణాదులు తెలుపుతున్నాయి.

"వైశాఖమాసస్య చయా తృతీయా
నవమ్యసౌ కార్తిక శుక్లపక్షే,
నభస్యమాసస్య తమిస్రపక్షే,
త్రయోదశీ పంచదశీ చ మాఘే.

వైశాఖశుద్ధ తదియనాడు కృతయుగాది, కార్తీకశుద్ధ నవమినాడు త్రేతాయుగాది, భాద్రపద బహుళ త్రయోదశినాడు ద్వాపరయుగాది, మాఘపూర్ణిమనాడు కలియుగాది సంభవించాయి" అని విష్ణుపురాణం చెబుతున్నది. ఈ తదియనాడు రోహిణీనక్షత్రం వస్తే మరింత శ్రేష్ఠమట.

ఈ వైశాఖశుద్ధ తదియ కృతయుగాది గనుక ఉదయమే స్నానంచేసి, జపతపాలు చేసి, ఉదకఘటం, గ్రీష్మఋతువులో పండేపంటలను, దధ్యోదనం దానం చేస్తారు. కొన్ని ప్రాంతాలలో కృష్ణునికి, గౌరికి డోలోత్సవం చేస్తారు. ఈ ఉత్సవాన్ని కన్యలు, ముత్తైదువులు జరిపి, పండ్లు, మిఠాయిలు, నానవేసిన సెనగపప్పు వాయనాలిస్తారు. వ్రతమాచరించేవారు ఈనాడు ఉప్పునుమాని, చక్కెర కలిపిన పేలపిండి పుచ్చుకుంటారు. కొందరు ఉపవాసం చేస్తారు.

బదరీనారాయణ మందిర ద్వారం ఈనాడు తెరుస్తారు. అంతవరకు మంచు పేరుకొని వుంటుంది. ఈనాటికి కరుగుతుంది. హృషీకేశంలో యాత్రికులు భరత మందిరంలో 108 సార్లు ప్రదక్షిణం చేస్తారు. ఈనాడు చేసే పుణ్యకార్యాల ఫలం అక్షయంగా వుంటుంది గనుక దీనికి అక్షయతృతీయ అని పేరు వచ్చినదని భారతంలో ధర్మరాజుకు కృష్ణుడు చెప్పాడట.

ఈ పండుగ ఋతువుకు సంబంధించిందనడం స్పష్టం. ఇది యుగాది అనడంవల్ల, రోహిణీ నక్షత్రంతో కలిస్తే ప్రశస్తమనడాన్ని బట్టి, ఇది మనకు

ఒకానొకప్పుడు సంవత్సరాదిగా ఉండి వుంటుందని మనం భావించవచ్చు. మంచు పేరుకొన్న ప్రాంతాలలో మంచు కరిగి వసంతం అక్షయం కావడంవల్ల దీనికి ఈ పేరు వచ్చి వుంటుంది.

# పరశురామ జయంతి

పరశురామ జయంతి వైశాఖశుద్ధ తదియనాడు చేస్తారు. పరశురాముడు విష్ణువు దశావతారాలలో ఒకడు. ఇతడు వైశాఖ శుద్ధ తృతీయనాడు పునర్వసు నక్షత్రంలో రాత్రి, మిథున లగ్నంలో ఆరు గ్రహాలు ఉచ్చస్థానంలో ఉండగా, రేణుకా గర్భం నుంచి అవతరించాడని స్కాంద పురాణము తెలుపుతున్నది.

పరశురాముని తండ్రి జమదగ్ని మహాకోపిష్ఠుడు.* ఆతనికి పరశురాముని తల్లి రేణుకపై అనుమానంకలిగి ఆమెను నరికివేయుమని పరశురాముని ఆజ్ఞాపించాడు. అతడు అలాగే తండ్రి ఆజ్ఞ నిర్వర్తించాడు. తండ్రి కుమారుని పితృభక్తికి మెచ్చి, వరం కోరమన్నాడు. పరశురాముడు తల్లిని బ్రతికించమని వరం కోరాడు. తండ్రి వరం అనుగ్రహించాడు. ఒకనాడు కార్తవీర్యార్జునుడనే రాజు జమదగ్ని ఆశ్రమానికి వచ్చి, జమదగ్నికి సకలార్థాలు ఇచ్చే కామధేనువును బలాత్కారంగా తోలించుకొని పోయాడు. ఆ సమయంలో పరశురాముడు ఆశ్రమంలో లేడు. అతడు తిరిగి రాగానే సంగతి తెలిసింది, అతనికి కోపం వచ్చింది. కార్తవీర్యార్జునుని నగరుకుపోయి, అతనితో పోరాడి, చంపి, తన కామధేనువును ఆశ్రమానికి తోలుకొని వస్తాడు కాని, కార్తవీర్యార్జునుని పుత్రులు పగబట్టి పరశురాముడు ఆశ్రమంలో లేని సమయంలో వచ్చి జమదగ్నిని తల నరికి చంపివేస్తారు. పరశురాముడు రాగానే అతని తల్లి రేణుక దుఃఖంతో

---

* జమదగ్ని పరమ శాంత స్వభావుడని మహాభారతంలో చెప్పబడింది. సక్తుప్రస్థుని కథలో వచ్చు ముంగిస పూర్వజన్మమునందు జమదగ్నియని చెప్పబడింది. పితృదేవతలకోసం అతడు క్షీరము తెచ్చి ఒకచోట పెట్టగా ఎవరో దానిని బోర్లదోసిరి. సహనశీలుడైన జమదగ్ని దానికిని కోపింపలేదట. అంతట పితృదేవతలు ముంగివి కమ్మని అతని శపించిరట.

"నాయనా నీ తండ్రి లేడు" అని ఇరవయ్యొక్కమారు అనిందట. దాని మీదట పరశురాముడు కార్తవీర్యార్జునుని పుత్రులను చంపి, కోపం చల్లారక ఇరవయ్యొక్క మార్లు భూమండలమంతా తిరిగి క్షత్రియులను చంపివేసి, భూమిని క్షత్రియులు లేకుండ చేసినాడు. మరల ఆశ్రమానికి వచ్చి, తండ్రి తలను మొండెంతో కలిపి, యజ్ఞం చేసి తండ్రిని బతికించుకొన్నాడు. ఆ యజ్ఞంలో భూమినంతా కశ్యపునికి దానమిచ్చి, తపస్సు చేయడానికి మహేంద్రగిరికి పోయినాడు. తర్వాత దశరథ రామునితోను, అంబ వివాహసందర్భంలో భీష్మునితోను ఓడిపోతాడు. కశ్యపుడు అతనిని వెడలగొడుతాడు. అప్పుడు అతడు కైవర్త దేశానికి వెళ్ళి, కొందరు కైవర్తులను జందెంవేసి బ్రాహ్మణులనుగా మార్చినాడని స్కాందపురాణం సహ్యాద్రి ఖండంలో చెప్పబడింది. ఈ కారణం వల్లనే కాబోలు కొన్ని జాతులవారికి రేణుకాదేవి ఇలవేల్పయినట్లు తోస్తుంది.

పరశురామావతారం ఆంతర్యం బ్రాహ్మణ క్షత్రియుల మధ్య తాము గొప్ప అందే తాము గొప్ప అన్న స్పర్ధనని తోస్తుంది. క్షత్రియులు బాహు బలంతో గర్వపడగా, అకృత్యాలు చేయగా, పరశురాముడు అవతరించినట్లు పురాణాలు చెబుతున్నాయి. కనుక అక్రమపాలకులపై తిరుగుబాటని భావించవచ్చు.

పరశురామ జయంతినాడు ఉపవాసం చేసి, పరశురాముణ్ని షోడశోప చారాలతో పూజించి,

"జగదగ్నిసుత శ్రీమన్
క్షత్రియాంతకర ప్రభో!
గృహాణార్ఘ్యం మయాదత్తం
కృపయా పరమేశ్వర!"

అని అర్ఘ్యప్రదానం చేయాలని వ్రతగ్రంథాలు తెలుపుతున్నాయి.



# నరసింహ జయంతి

నరసింహావతారము మహావిష్ణువు నాల్గవ అవతారం. వైశాఖశుద్ధ చతుర్దశి నాడు సాయంకాలం సంధ్యాసమయంలో నరసింహుడు హిరణ్యకశిపు వధార్థం అతని ఆస్థానంలోని ఒక స్తంభం నుంచి ఆవిర్భవించినట్లు పురాణాలు తెలుపు తున్నవి. కనుక ఈనాడు నరసింహ జయంతి జరుపుతారు. నరసింహావతారకథ, ప్రహ్లాదకథ మనకు అందరికీ చిరపరిచితమైనవే.

నరసింహ భక్తులు వైశాఖశుద్ధ త్రయోదశిరాత్రి, చతుర్దశినాడు ఉపవాసం చేసి చతుర్దశినాడు ప్రదోషకాలంలో ఇండ్ల భవంతులలోని స్తంభాలను అలంకరించి, నరసింహ విగ్రహం పూజిస్తారు. ఈ స్తంభాలను తిరుమణి తిరుచూర్ణములతో అలంకరించుట శ్రీ వైష్ణవ సంప్రదాయం. ఆ రాత్రి జాగరణంచేసి, మరునటిదినం పారణ చేస్తారు. వైశాఖమాసంలో ఎండలు ఉంటాయి గనుక నరసింహునికి వడపప్పు, పానకం నైవేద్యం పెడుతారు, అందరికీ పంచిపెడుతారు, విసన కర్రలు దానమిస్తారు.

మన రాష్ట్రంలో నరసింహక్షేత్రాలు చాల ఉన్నవి. వాటిలో అహోబలము, వేదాద్రి, సింహాచలము, కదిరి, అంతర్వేది ముఖ్యమైనవి. ఈ క్షేత్రాలలో నరసింహ జయంతినాడు గొప్ప ఉత్సవాలు జరుగుతాయి.

మానవుడు ఎన్ని శక్తి యుక్తులు కలవాడైనా దైవ బలమే గొప్పది. దైవబలము, దైవసంకల్పము మానవుని యుక్తికిని, ఊహకును మించినవి అనే భావం అలవరచడానికే నరసింహ జయంతి ఉద్దేశింపబడినట్టు తోస్తుంది. దీనికి హిరణ్యకశిపుడు కోరినవరాలు, వారి ఇంట్లోనే అతని పుత్రుడే శత్రువు కావడం, విచిత్రపద్ధతిలో అతని మరణం మొదలయినవి నిదర్శనాలు. అంతేకాక డాక్టర్ హాల్డేన్, హెచ్. జి వేల్స్, తదితర జీవశాస్త్రజ్ఞులు అన్నట్టు మానవ జాతి వికాసంలో, మానవుడు ఆటవికస్థితినుంచి మానవత్వంవైపు పరిణమించేదశలో ఒక ఘట్టంగాను నరసింహావతారం మనకు జ్ఞానం కలిగిస్తుంది. మన అవతారా లన్నీ మానవజాతి పరిణామగాథలేనని తరచిచూడగా తెలుస్తుంది; ఇవి నవీన జీవశాస్త్ర సిద్ధాంతాలకు విరుద్ధమైనవేమీ కావని పరిశోధకుల భావం.

—(:o:)—

# ఏరువాక పున్నమ

ఏరువాక పున్నమ పండుగ జ్యేష్ఠశుద్ధ పౌర్ణమినాడు జరుపుతారు. ఇది పూర్తిగా కృషీవలుల పండుగ. ఏరువాక అంటే, దుక్కి ప్రారంభం. ఈ పున్నమనాడు కర్షకులు ఉదయమే ఎడ్లను కడిగి, వాటి కొమ్ములకు రంగులు పూసి, గజ్జెలు గంటల పట్టెడలతో అలంకరిస్తారు. పిదప ఎడ్లను కట్టే గాటిని, పశువుల కొట్టాన్ని కడిగి శుభ్రంచేసి ధూపదీపాలతో పూజించి ఎడ్లకు పొంగలి పెడుతారు, సాయంకాలం నాగళ్ళను, గొర్రును ఎర్రమట్టి పట్టెలతోను, రంగు పట్టెలతోను అలంకరించి, భుజాలపై పెట్టుకొని, ఎడ్లను మంగళవాద్యాలతో ఊరేగింపుగా తమ పొలాలకు వెళ్ళి, నాగళ్ళను పూజించి దుక్కి ప్రారంభిస్తారు. ఊరివాకిట గోగునారతో చేసిన తోరణం కట్టి, దానిని చేరుకోలలతో కొట్టి ఎవరికి దొరికిన పీచును వారు తీసుకొనిపోవడం ఆచారం. దీనివల్ల తమ పశువులకు మేలు కలుగుతుందని కర్షకుల నమ్మకం.

దేశమంతటా జరిగే ఈ వ్యవసాయ ప్రారంభపూజను వ్రతగ్రంథకారులు గాని, ధర్మశాస్త్ర గ్రంథకారులు గాని తెలుపకపోవడం విచిత్రంగానే వుంది కాని, హేమాద్రి ఈనాడు వటసావిత్రీవ్రతం, వృషోత్సర్జనవ్రతం, పుత్రకామ వ్రతం తెలిపినాడు. ఇది సస్యారంభానికి సూచన కావచ్చును.

కాని, ఈ పండుగ వేదకాలం నుంచి ఉన్నట్లు తెలుస్తున్నది. కృషీవలులు వర్షర్తువు ఆరంభం కాగానే, దుక్కి ప్రారంభించి క్షేత్రపాలుని సంబోధించే మంత్రాలు ఋగ్వేదంలో ఉన్నవి. విష్ణుపురాణము దీనిని 'సీతాయజ్ఞం' అని పేర్కొన్నది. పాళీప్రాకృత సాహిత్యంలో దీనిని "వప్పమంగల దివస"– బీజావాపన మంగళదివసం– అన్నారు. శుద్ధోదన మహారాజు ఆనాడు కర్షకులకు బంగారురంగు నాగలిని అందజేసేవాడని మహాయాన బౌద్ధుల పవిత్రగ్రంథమగు లలితవిస్తరంలో వర్ణన ఉన్నది. ఈ పండుగ గొప్పగా జరిగేదని, రాజధాని అయిన కపిలవస్తులోను మహావైభవంతో జరిగేదని చీనాభాషలోని బౌద్ధగ్రంథాలు తెలుపుతున్నవి. ప్రాకృత ముక్తక సంకలనమైన గాధా సప్తశతి దీనిని 'వాహణ పుణ్ణాహ మంగళం' "కర్షణ పుణ్యాహ మంగళం అని" వర్ణించింది. దీనికి తర్వాత

వైదిక ముద్ర పడింది. మీమాంసకులు దీనిని "ఉద్వృషభయజ్ఞః" అన్నారు. ఇది జ్యేష్ఠపూర్ణిమనాడు జరుగుతుందని, ఎడ్లను పూజించి పరుగెత్తిస్తారని అన్నారు. వర్షాకాలంలో దుక్కి సాగటాన్ని కృష్ణదేవరాయలు చక్కగా వర్ణించినాడు.

—:(o):—

# మంచెద్దుల అమావాస్య

ఇది జ్యేష్ఠబహుళ అమావాస్యనాడు జరుపబడుతుంది. ఇది పూర్తిగా కృషీవలుల పండుగ. ఏరువాకతో ఆరంభమయిన దుక్కిని, ఆషాఢమాసం ప్రారంభంలో తీవ్రం చేయడానికి సూచనగా ఇది, తెలంగాణా ప్రాంతంలో జరుపబడుతుంది, విశేషంగా. నెలల పరిగణన ఒకానొకప్పుడు అమావాస్యతో ఉండేదనడానికి కూడ ఇది ఉపలక్షణం. ఆషాఢమాసం ప్రారంభమవుతుందనగా ఈ పండుగ చేయడం ఇంద్రోత్సవంలో భాగమనీ కొందరన్నారు.

ఈనాడు కర్షకులు, ఇతరులు పుట్టమన్ను తెచ్చి, స్నానాదుల తర్వాత శుచిగా, ఆ మంటితో ఎడ్లజతను- కాడి గట్టిన ఎడ్ల జతను-చేసి పూజాగృహంలో కాని, భవంతి పడుసాలలో గాని ముగ్గులు తీర్చి పీటపై పెట్టి, పూజ చేస్తారు. చక్కెర పొంగలిని నైవేద్యం పెడుతారు; లేకపోతే సాధారణంగా పరమాన్నం నైవేద్యం పెడుతారు. పసులకొట్టం శుభ్రంచేసి, ఎడ్లకు పొంగలినో, పరమాన్నాన్నో తినిపిస్తారు. సాయంకాలం ఎడ్లను అలంకరించి పరుగెత్తించడం వంటి వినోదాలేమీ ఉండవు.

—(o)—

# నాగపంచమి

నాగపూజ మనదేశంలో అతి ప్రాచీన కాలం నుంచి ఉంది. ఈ పూజకు చిహ్నమే నాగపంచమి, లేక నాగులచవితి పండుగలు. ఇంతేకాక ఈ పండగ సంవత్సరంలో పెక్కుసార్లు జరుపబడుతున్నట్లు ప్రతగ్రంథాలవల్ల తెలుస్తున్నది. కాని, మన తెలుగునాట శ్రావణశుద్ధ పంచమినాడు, కార్తికశుద్ధ చవితినాడు జరుపుతారు. మొదట దానికి నాగపంచమి అని, రెండవదానికి నాగులచవితి అని పేర్లు.

నాగపంచమినాడు ప్రజలు శిరస్స్నానం చేసి, సర్ప విగ్రహాలకు పాలు, కొబ్బెర, అన్నం, పేలాలు, పరమాన్నం నైవేద్యం పెడుతారు. తర్వాత పుట్టల వద్దకు పోయి, ప్రత్తితో చేసిన- దారము వడుకక చేసిన - వస్త్రాలను, యజ్ఞోప వీతాలను పుట్టపై అలంకరించి, పుట్టను పూజించి, పుట్టలో పాలుపోసి, ప్రదక్షిణ నమస్కారాలు చేస్తారు. ప్రతిగ్రామంలోను వేపచెట్టు మొదట్లోనో అశ్వత్థవృక్షం మొదట్లోనో స్థాపించిన నాగ విగ్రహాలకు ఈనాడు పూజ జరుగుతుంది. బాల బాలికలు ఎండు కొబ్బెర గిన్నెలను చిత్ర విచిత్రంగా అలంకరించి, నాటి మధ్యన బెజ్జంవేసి రెండు దారాలు కట్టి, తిప్పడం కొన్ని ప్రాంతాలలో ఉంది. సాయంకాలం తోటలకో, ఊరి బయటి అడవులకో వెళ్ళి, చెట్ల కొమ్మలకు తాళ్ళు వేలాడగట్టి ఉయ్యాల లూగుతారు. స్త్రీ పురుషులు అరమరలు లేక ఆత్మీయతతో ప్రవర్తిస్తారు.

నాగపంచమిని గురించి పురాణేతిహాసాలలో ఎన్నో కథలున్నాయి. వాటిని పరిశీలించగా, పాముల భయం పూర్వులకు ఎంత ప్రబలంగా ఉండేదో స్పష్టమవుతుంది. శ్రావణ మాసంలో వర్షాలవల్ల పుట్టల నుంచి బొరియల నుంచి పాములు వెలుపలికి వచ్చి, బాధిస్తాయి. కనుకనే ఈ నాగపూజ వర్షాకాలంలో ప్రాధాన్యానికి వచ్చివుంటుంది.

పాములు పంటలను అభివృద్ధి పరుస్తాయని, పుత్ర సంతానం కలిగిస్తా యని, ప్రపంచమంతటా ప్రజలు భావించేవారని వివిధ మానవజాతి చరిత్రలవల్ల తెలుస్తున్నది. నీళ్ల భూమిలో నుండడంవల్ల పాములు ఆగ్రహిస్తే నీటిని పైకి ఉబుకకుండ చేయగలవనే నమ్మకము పూర్వం వ్యాపించి ఉండేది. కనుక పాములు

పంటలకు అధిదేవతలని నమ్మేవారు. పంటల దేవత సంతానమును కలిగించగలదనే విశ్వాసం క్రమంగా ప్రబలింది. మొహంజోదారో శిథిలాలలో దొరికిన నాగచిత్రాలున్న ముద్రికలను బట్టి కూడ ఈ నమ్మకం అతి ప్రాచీనమని భావించవచ్చును. ఈ నమ్మకము మన దేశంలో వైదికాచారంగాను క్రమంగా పరిణమించింది. మన శ్రౌత గృహ్యసూత్రాలలో నాగబలి విధించబడింది శ్రావణ పూర్ణిమ మొదలు మార్గశిర మాసంవరకు ప్రతిదినం సాయంకాలం నేతితో తడిపిన పేలపిండి పాములకు బలి ఇవ్వవలెనని ఈ విధి.

ఈ నాగపూజ సర్పపూజ కాక, నాగులు జాతీయ చిహ్నంగా గల ప్రాచీన అనార్య జాతివారని, వారి ఆచారాలు, వారికి, గరుడజాతికీ కలిగిన వైరాలు, విజయాలు ఈ పండుగగా పరిణమించినవని కొందరు పరిశోధకులన్నారు. నాగజాతివారికి ఆస్తీకుని ప్రయత్నంతో అభయం కలిగిన తర్వాత, పాముల భయమూ, వర్షాకాలంలో పాలు పేలాలు, వంటి లఘ్వాహారం సేవించాలనే వైద్యకగ్రంథాల ఉపదేశాలు కలిసి ఈ పండుగగా నిలిచిపోయినట్లు మనం ఊహించవచ్చు.

కారణాలు ఏమయినా, ఈ పండుగ నేడు దేశమంతటా మహోత్సాహంతో జరుగుతుంది. వంగదేశంలోను, మధ్యభారతంలోను సర్పరాజ్ఞి మనసాదేవి పూజలు జరుగుతాయి. రాజస్థానంలో పురాణయుగపు పీపా, తేజాజీ మున్నగు నాగరాజుల సంస్మరణజరుగుతుంది. దక్షిణభారతంలో నాగప్రతిష్ఠలు జరుగుతాయి.

నాగపంచమిని వైష్ణవ సంప్రదాయానుయాయులు గరుడ పంచమి అంటారు ఇది గరుడపురాణంలో పేర్కొనబడింది.

మన రాష్ట్రంలో కొన్ని ప్రాంతాలలో, ముఖ్యంగా సముద్ర తీరాంధ్ర ప్రాంతంలో, నాగుల చవితిగా ఈ పండుగ కార్తీక శుద్ధచవితినాడు చేస్తారు. ఈ పండుగ కూర్మపురాణంలో ఉదాహరించబడింది. శ్రీనాథుడు కాశీఖండంలో

"చలి ప్రవేశించు నాగుల చవితినాడు
మెటయు వేసవి రథసప్తమి దివసమున
అచ్చసీతు ప్రవేశించు పెచ్చుపెరిగి
మార్గశిర పౌషమాసాల మధ్యవేళ".

అని చెప్పడాన్నిబట్టి నాగులచవితి శ్రీనాథుని కాలానికి ముందునుంచే తెలుగు దేశంలో కొన్నిచోట్ల కార్తికశుద్ధ చవితినాడు చేసే ఆచారం ఉన్నట్టు స్పష్టమవుతుంది.

తక్కిన నాగపూజలు కూడ వ్రతగ్రంథాలలో చాల ఉన్నాయి. చైత్రశుద్ధ పంచమి, వైశాఖశుద్ధ చవితి, శ్రావణ పూర్ణిమ నాగబలి, భాద్రపదశుద్ధ పంచమినాడు నాగ దష్టోద్ధరణ పంచమి, మార్గశిరశుద్ధ పంచమినాడు నాగపూజ, శ్రావణశుద్ధ పంచమినాడు అనంతపంచమి, ఇట్లా నాగపూజా దినాలు చాల ఉండడాన్నిబట్టి నాగ విగ్రహాల నిర్మాణం గురించి పురాణాలలో చెప్పిన లక్షణాలు, శిల్పాలు బట్టి- పైభాగం ఆయుధాలు ధరించిన మానవరూపం, కింది భాగం సర్పరూపం- పాముల భయం, ఋతువుల ప్రభావం, నాగజాతివారి ఆచారాలు, వారి పరాజయానంతరం సమ్మేళనం మొదలయినవన్నీ మేళవించినది ఈ పండుగ అని స్పష్టమవుతున్నది.



# శ్రావణ పూర్ణిమ-రాఖిపూర్ణిమ

ఋతువులను అనుసరించి ప్రతి పనిని ప్రారంభించే మన పూర్వులు విద్యారంభానికి ఒక కాలం నిర్ణయించుకొన్నారు. ఆ విద్యారంభ కాలమే శ్రావణ పూర్ణిమ. ఈనాడు ద్విజులు అధ్యాయోపాకర్మ జరిపేవారు. ఇదే ఉపాకర్మ అని వ్యవహారం పొందింది. అధ్యాయోపాకర్మ అంటే వేదాధ్యయన ప్రారంభం; వేదం కొత్తగా అధ్యయనం చేయడమేకాక, జ్ఞాపకం ఉంచుకోడానికి ఆవృత్తి చేయడం, వల్లెవేయడానికి కూడా ఈదినం నిర్ణయించుకొన్నారు.

ఈ వేదోక్తకర్మ ద్విజులందరికీ సమానమైనా, నేడు బ్రాహ్మణులు మాత్రమే అనుసరిస్తున్నారు. వారు ఈ పూర్ణిమనాడు ఉదయమే లేచి నిత్యకర్మ తర్వాత "ఇంతవరకు నేను చేసిన లోపాలు కామక్రోధాలవల్ల చేసినాను; కామమే చేయించింది; నేను కర్తను కాను" అని అర్థమిచ్చే "కామోకార్షీత్" మంత్రం 108 సార్లు జపిస్తారు. ఇది ఆత్మ పరిశీలన చేసుకొనే మంత్రం. మధ్యాహ్నం అందరూ కలిసి నదికో, చెరువుకో వెళ్ళి స్నానాదులు మళ్ళీ చేసి, కొత్త యజ్ఞోపవీతం, మౌంజి, అజినం ధరించి, కాండఋషి తర్పణం- మూలఋషులను

స్మరిస్తూ తర్పణం- చేస్తారు: తర్వాత వేదాధ్యయనాన్ని ప్రారంభించినందుకు చిహ్నంగా ప్రతివేదం ఆద్యంత మంత్రాలు, ప్రతి ఉపనిషత్తు ఆద్యంత వాక్యాలు పఠిస్తారు. ఇంటికి వచ్చి అధ్యయన హోమం చేస్తారు. మరుసటిదినం ఉపాకర్మాంగ భూతంగా 1008 మార్లు గాయత్రీజపం చేస్తారు, కొందరు గాయత్రీ హోమమూ చేస్తారు కర్మకాండ అంతా సంగ్రహమైన ఉపనయనమని అనవచ్చు.

విద్యారంభకాలమూ, వేదపునశ్చరణకాలమూ ఇదే అనడానికి కారణమేమి అని ప్రశ్నించవచ్చు. వర్షఋతువు నుంచి చాతుర్మాస్యవ్రతం ఆరంభమవుతుంది. వానల వలన ఎక్కడికీ పోవడానికి అవకాశం ఉండదు. ఏరువాక సాగి మళ్ళలో మొలకలు తలఎత్తుతుంటాయి. తీరిక ఉంటుంది. కనుకనే గృహ్యసూత్రకారులు "ఓషధీనాం ప్రాదుర్భావే"- ఓషధులు మొలకెత్తిన తర్వాత, శ్రవణ నక్షత్ర యుక్త శ్రావణ పూర్ణిమనాడు గాని, హస్తా నక్షత్రం గల దినంలోగాని వేదాధ్యయనం చేయాలి- అని ధర్మశాస్త్ర కారులు అన్నారు. కనుక హస్తా నక్షత్రం మరుసటి చవితినాడు రావడాన్ని బట్టి సామవేదులు వినాయక చవితినాడు ఉపాకర్మ చేస్తారు.

వేదాధ్యయన దీక్షకోసం నూతన యజ్ఞోపవీతధారణం అనే ఆచారం ఇతర వర్గాలలో నూతన కార్యారంభానికి రక్షాబంధంగా ఏర్పడింది, కనుక దీనికీ రక్షాపూర్ణిమ, రాఖీపూర్ణిమ అనే వ్యవహారం ఏర్పడింది. ఇది ప్రాచీనకాలం నుంచి వున్నట్టు భవిష్యోత్తర పురాణ వాక్యాలను హేమాద్రి ఉదాహరించినాడు. దానవులతో ఓడిపోయిన ఇంద్రునికి శచీదేవి రక్షకట్టి, గెలిపించిందట ఇది క్రమంగా మొగలురాజుల కాలంలో స్త్రీల రక్షణకోసం రాజపుత్రులు అనుసరించినారు. చిత్తూరు మహారాణి కర్ణావతి, తన కోటను గుజరాత్ నవాబు బహదూర్‌షా ముట్టడించినప్పుడు, రక్షించమని రక్షాబంధనం పంపి హుమాయూనును కోరింది. అతడు దానిని స్వీకరించి ఆమెను సోదరిగా భావించి రక్షించినాడు. నేడిది ఉత్తరదేశమంతటా, సోదరి సోదరునికి రక్ష, రాఖీకట్టే సంప్రదాయంగా వ్యాపించింది. నిజానికి ఇది దీక్షాకంకణధారణమే తప్ప చెల్లెలి ప్రసక్తి లేదు.

పాల్కురికి సోమనాథుడు ఈ శ్రావణ పూర్ణిమను నూలి పున్నమ అన్నాడు. నూలి పున్నమ అందే, యజ్ఞోపవీతం వేసుకొనే పున్నమ. నూల్-యజ్ఞోపవీతం. తమిళంలో దీని పూనూల్ అంటారు.

మహారాష్ట్ర, కర్ణాటాదిక ప్రాంతాలలో సముద్ర తీర వాసులు ఈ పండుగను విశేషంగా జరుపుకొంటారు. సముద్రాన్ని పూజించి నారికేళాలు సమర్పిస్తారు. కనుక దీనిని నారికేళ పూర్ణిమ, నార్లీ పూర్ణిమ అంటారు.

రక్షాబంధనం కట్టుకొనడానికి ఒక మంత్రమూ హేమాద్రి తెలిసినాడు. శ్రావణ పూర్ణిమనాడు ఋషితర్పణం తర్వాత, అపరాహ్ణంలో రక్షాపోటలిని-పొట్లంను, అక్షతలు ఆవాలు మొదలయినవాటితో సిద్ధపరచి, పూజించి

"యేనబద్ధో బలీరాజా
దానవేంద్రో మహాబలీ
తేనత్వాం అభిబధ్నామి
రక్షే మాచల మాచల"

"నీవు మహాబలవంతుడైన బలిని కట్టివేసినావు, నిన్ను కట్టుకొంటున్నాను" అనే మంత్రంతో కట్టుకోవాలి.

---

# వరలక్ష్మీ వ్రతం

వరలక్ష్మీవ్రతం శ్రావణ పూర్ణిమకు వెనుకవచ్చే శుక్రవారం జరుపుతారు అది వీలుకాకపోతే, శ్రావణమాసంలో వచ్చే ఏ శుక్రవారమయినా చేస్తారు. దీనిని స్త్రీలు సౌమంగల్యంకోసం సత్సంతానాభివృద్ధికోసం చేస్తారు.

ఈ వ్రతదినం ఉదయమే స్త్రీలు మంగళస్నానంచేసి, కొత్తబట్టలు కట్టుకొని, ఇంటి భవంతిలోగాని. మరొకచోటగాని మంటపంకట్టి, దాని మధ్యన ముగ్గులతో కమలం తీర్చి, కలశం స్థాపించి, దానిపైన కొబ్బరికాయ పెట్టి, దానికి లక్ష్మీరూపం అలంకరించి, లక్ష్మిని ఆవాహనంచేసి, షోడశోపచారాలతో పూజిస్తారు. పూజానంతరం పసుపు పూసిన తోరం చేతికి కట్టుకొంటారు. సాయంకాలం ఆరతియెత్తి పేరంటం చేస్తారు. పూజానంతరం వరలక్ష్మీవ్రతకథ చదువుతారు. ఈ కథ తెలిపే పాటలు- అనాదిగా జానపద గాథల మట్టులలో ఉన్నవి- పాడుతారు.

మంటపాన్ని వర్షాకాలంలో ఫలించే పండ్లతో అలంకరించడం, నైవేద్యానికి ఆవిరికుడుములు వంటి తేలికయిన తినబండారాలను సిద్ధపరచడం, అన్నిటిని ఐదైదుగా పెట్టడం మొదలయిన ఆచారాలనుబట్టి ఇది వర్షఋతువు పూజగానో, వరాలు ప్రసాదించమని ప్రకృతి లక్ష్మిని పూజించడంగానో ప్రారంభమయి ఉంటుందని అనవచ్చు. ఇది పూర్తిగా ప్రకృతిదేవి పూజగానే కనిపిస్తుంది.

# కృష్ణాష్టమి

రామకృష్ణావతారాలు మహావిష్ణువు సంపూర్ణావతారాలని మనవారి విశ్వాసము. కృష్ణావతారం దశావతారాలలో ఎనిమిదవది. కృష్ణచరితం హరివంశ భాగవత విష్ణుపురాణాలలో విపులంగా ఉంది. ఈ మహామహుడు దివ్య సుందరమూర్తిగాను, మహా బలపరాక్రమవంతుడుగాను, రాజనీతి దక్షుడుగాను, తత్త్వవేత్తగాను వర్ణించబడినాడు. భారతభాషలలో కృష్ణునిపై ఉన్నంత సాహిత్యం ఏ ఇతరునిపైనను లేదనవచ్చు. ఇతడు మనకు ప్రసాదించిన గొప్పవరము భగవద్గీత. రాజనీతి దృష్టితో ఇతడు భారతదేశంలో– ప్రపంచంలోనే– తొలిసారిగా కేంద్ర పరిపాలన పద్ధతిని నెలకొల్పి దేశసమైక్యమును పటిష్ఠం చేసినాడు.

ఈ మహాపురుషుని జన్మదినోత్సవం శ్రావణ బహుళ అష్టమినాడు జరుపుతున్నాము. అష్టమినాడు రోహిణీనక్షత్రంలో రాత్రి అవతరించినాడు గనుక, అష్టమినాడు పగలంతా ఉపవాసం చేసి, సాయంకాలం పూజలు జరుపుతారు. మంటపంకట్టి దానిని ఈ ఋతువులో లభించే ఫలాలతో ఫలావళికట్టి, అలంకరిస్తారు. జనన సూచకంగా ఉయ్యాలలు కట్టి కృష్ణుని ఆడించడం, మంచంపై విగ్రహాన్ని పడుకోబెట్టి పూజించడం, బాలింతలకు శొంఠి ముఖ్యం గనుక శొంఠి, బెల్లం కలిపిన వెన్నను, వివిధభక్ష్యాలను నైవేద్యం పెట్టడం ఆచారం. కృష్ణుడు బాల్యంలో వ్రేపల్లెలో జరిపిన లీలలకు చిహ్నంగా, వీథులలో ఉట్లు కట్టడం, మరునటిదినం వాటిని పోటాపోటీలతో కొట్టడం మొదలైన వినోదాలు దేశమంతటా జరుపుతారు. విష్ణుదేవాలయాలలో ఉత్సవాలు విశేషంగా చేస్తారు.

కృష్ణుడు కలియుగారంభమయిన తర్వాత 28వ ఏట భాద్రపద బహుళాష్టమినాడు జన్మించినాడని వ్రతగ్రంథాలు తెలుపుతున్నాయి. బహుళపక్షంతో ఆరంభమయ్యే నెలల పద్ధతి మనకు ఒకప్పుడు ఉండేది. దీనిప్రకారం భాద్రపద మాసమని కొందరు ఇప్పటి భాద్రపదమాసంలోనే శ్రవణనక్షత్రం ప్రధానమని మరికొందరు రెండువిధాలుగా జరుపుతున్నారు. మన పండుగలన్నిటికీ ఉన్నట్లే దీనికీ, జ్యోతిశ్శాస్త్రసంబంధం ఉంది. భాద్రపద కృష్ణాష్టమినాడు వచ్చే రోహిణీ నక్షత్రాన్ని 'జయంతీ' అనడం జ్యోతిశ్శాస్త్ర సంప్రదాయం. ఈ శ్రావణ భాద్రపదమాసాలలో అష్టమితో కలిసిన రోహిణిని జయంతీ అని, కృష్ణా అని అంటారు, ఇది గొప్పదినమని వసిష్ఠసంహిత తెలుపుతున్నది. ఈ దినం చంద్రునికి అర్ఘ్యమివ్వాలని నియమించారు వ్రతగ్రంథకారులు. దీనిని బట్టి ఇది మొదట జ్యోతిశ్శాస్త్ర ప్రాధాన్యం కలిగినట్టిదని, తర్వాత దీనికి కృష్ణ జన్మగాథ అనుసంధింపబడిందని తోస్తుంది.

ఈ కృష్ణుడు పూర్ణాయుస్సుతో ఉండినాడని, 125 ఏండ్లు జీవించాడని హరివంశ విష్ణుపురాణ భాగవతాలు తెలుపుతున్నాయి. దేవకీ సూనుడైన కృష్ణునికి ఆంగిరసుడనే ఋషి పురుషయజ్ఞవిద్యను ఉపదేశించాడని, దానిని అతడు అచరించి 116 సంవత్సరాలు జీవించాడని, ఛాందోగ్యంలో ఉన్నది పురుష యజ్ఞానికి తపస్సు, దానము, ఆర్జవము, అహింస, సత్యము దక్షిణలట. అంటే, ఈ గుణాలు గలవాడు దీర్ఘజీవి అవుతాడని అర్థం.

కృష్ణుని చరితం పరమపవిత్రమైనదని, వేదంలో జ్యోతిర్గణ విషయంలో చెప్పిన కృష్ణ, రాధ, అర్జునాది పదాలను, వాటి ఆంతర్యం తెలియని వారు కథలు కల్పించి మూలతత్త్వం మరుగుచేసినారని విమర్శకులు అభిప్రాయపడు తున్నారు.

వందే బృందావనచరం
వల్లవీజన వల్లభమ్,
జయంతీ సంభవం ధామ
వైజయంతీ విభూషణమ్

—(०)—

# వినాయక చవితి

మనదేశంలో త్రిమూర్తుల తర్వాత విశేషంగా పూజింపబడే దైవం వినాయకుడు. ఏ కార్యమైనా నిర్విఘ్నంగా సమాప్తికావడానికి వినాయకుని పూజతో ప్రారంభమవుతుంది. ప్రతి శుభకార్యం మొదట్లో ఆరాధింపబడే ఈ దైవం భాద్రపద శుక్ల చతుర్థినాడు జన్మించినట్లు పరిగణించడంవల్ల ఆదినం విశేషపూజలు జరుపుతారు.

భాద్రపద శుద్ధ చవితినాడు మంగళస్నానం చేసి, బంకమట్టితో చేసిన వినాయక విగ్రహాన్ని ఇంటి భవంతిలో అరుగుమీద పీటవేసి, దానిపై వడ్లుగాని, బియ్యంగాని పరిచిఉంచి, అలంకరించి, వినాయకుని ఆవాహనచేసి, పూజలు జరుపుతారు. భాద్రపదమాసంలో లభించే-మాచిపత్రి, తులసి, బిల్వం, మరువం, వాకుడు, గరిక, ఉమ్మెత్త, రేగు, ఉత్తరేణి, మామిడి, గన్నేరు, విష్ణు క్రాంత, దానిమ్మ, దేవదారు, వావిలి, జాజి, గణకి, జమ్మి, రావి, మద్ది, జిల్లేడు- 21పత్రులతోను, పూవులతోను పూజిస్తారు. కుడుములు, ఉండ్రాళ్లు ప్రత్యేకంగా నైవేద్యం పెడుతారు. ఇవి 21 విధాలుగా నేతితో చేస్తారు. ఇవే కాక ఈ ఋతువులో పండే నేరేడు, వెలగ మొదలయిన పండ్లన్నీ నివేదిస్తారు. వినాయక విగ్రహంవద్ద అఖండదీపం పెడుతారు ఇది మరుసటి దినం సాయంకాలం వరకు ఉండాలి, మరునాటి సాయంకాలం విగ్రహాన్ని నదిలోనో, చెరువులోనో, బావిలోనో విసర్జిస్తారు. కొన్ని ప్రాంతాలలో ఈ విగ్రహాన్ని ధాన్యపు గాదెలలో ఉంచడం, గూళ్ళలో పెట్టి అద్దంవేసి మెత్తివేయడం ఆచారం. దీనివల్ల ధాన్యం అక్షయంగా వుంటుందని, అపుత్రులు పుత్రవంతులవుతారని ప్రజల విశ్వాసం

వినాయక చవితినాడు చంద్రుణ్ని చూడడం వల్ల లేనిపోని అపవాదాలు కలుగుతాయని ప్రజలలో విశ్వాసంవుంది. ఒకవేళ చూస్తే ఆదోషపరిహారార్థం

"సింహం ప్రసేన మవధీత్
సింహో జాంబవతా హతః,
సుకుమారక మా రోద
తవ హ్యేష శమంతకః"

అనే శ్లోకం పఠించవలెనని, శమంతకోపాఖ్యానం వినాలని పురాణాలు చెబుతున్నాయి. ఈ విషయమై స్కాంధపురాణంలో ఒక గాథ వుంది:- "గణపతికి రుద్రుడు గణాధిపత్యం కట్టినాడు. బ్రహ్మదేవుడు అణిమాద్యష్టసిద్ధులను వినాయకునికి భార్యలుగా చేసినాడు. దానికి వినాయకుడు సంతోషించి బ్రహ్మను వరమడుగు మన్నాడు. సృష్టి కార్యము నిర్విఘ్నంగా కొనసాగేట్టు వరమిమ్మని బ్రహ్మ కోరగా 'తథాస్తు!' అన్నాడు వినాయకుడు. తర్వాత గణపతి మోదకాలు చేతబట్టి, మూషికవాహనం ఎక్కి సప్తలోకాలూ విహరించి, చంద్రలోకానికి వెళ్ళాడు. రూపగర్వితుడైన చంద్రుడు వినాయకుని చూచి పకపకా నవ్వాడు. గణపతి కోపగించుకొని, "నీ మొగం చూచిన జనం అపనిందల పాలవుదురు గాక!" అని శపించాడు. శాపభయంతో చంద్రుడు సముద్రంలో దాగినాడు. అప్పుడు లోకాలు అంధకారబంధురమయ్యాయి. దేవతలు వినాయకుని దర్శించి చంద్రుని శాపం మరల్చమని ప్రార్థించారు. వినాయకుడు అనుగ్రహించి "భాద్రపదశుద్ధ చవితినాడు చంద్రుణ్ని దర్శించేవారికి మాత్రం ఈ అపవాదం సంవత్సర పర్యంతం వుంటుంది. తక్కినవారికి వుండదు. ఆనాడు కూడ శమంతకోపాఖ్యానం వింటే, ఆ అపవాదము వుండదు" అని సెలవిచ్చినాడు.

ఈ శమంతకోపాఖ్యానము హరివంశ, విష్ణుపురాణ, భాగవత, స్కాంద పురాణాలలో ఇలా ఉంది:- ద్వారకలో నిమ్నుడనేవానికి ప్రసేనజిత్తు, లేక ప్రసన్నుడు, సత్రాజిత్తు అనే కుమారులుంటారు. సత్రాజిత్తు సూర్యుని ఆరాధించి ఒక మణిని పొందుతాడు. ఆ మణి దినదినమూ ఎనిమిది బారువుల బంగారు మణులు కురిపించేదట. అటువంటిది రాజు వద్ద ఉండదగిందని కృష్ణుడు దానిని ఉగ్రసేనునికి ఇమ్మని సత్రాజిత్తును కోరినాడు. అతడు నిరాకరించి, కృష్ణునికి భయపడి తన అన్న అయిన ప్రసేనజిత్తుకు ఇచ్చినాడు. ప్రసేనజిత్తు దానిని ధరించి ఒకనాడు వేటకు పోయి సింహం వాతపడి మరణించాడు. సింహం ఆ మణిని నోటకరచుకొని పోతుండగా జాంబవంతుడు దానిని చంపి రత్నం తీసుకొని తన కుమారునికి ఆటవస్తువుగా ఇచ్చినాడు. కృష్ణుడే ప్రసేనజిత్తును చంపించాడని సత్రాజిత్తు అపవాదు ప్రచారం చేశాడు. ఈ నిందను తొలగించుకొనడానికి కృష్ణుడు అడవికి వెళ్ళి వాస్తవస్థితి గ్రహించి జాంబవంతునితో ఎనిమిది దినాలు పోరాడి, అతని నోడించి, మణితోపాటు జాంబవతిని కూడ గ్రహించి మణిని సత్రాజిత్తుకు అప్పగించాడు: సత్రాజిత్తు పశ్చాత్తాపపడి, తన కుమార్తె

అయిన సత్యభామను కృష్ణునికిచ్చి పెళ్ళిచేస్తాడు. కాని, శతధన్వుడనేవాడు సత్రాజిత్తును చంపి, ఆ మణిని అపహరించినప్పటికీ, దానిని అక్రూరునికిచ్చి పారిపోయాడు కృష్ణుడు అదితెలిసి, దానిని అక్రూరునివద్ద నున్నదని అందరికీ తెలిపి, నీలాపనింద నుంచి విముక్తుడౌతాడు.

ఈ అపనిందలు పోయే పద్ధతి మరొకటి కూడ వుంది. చవితినాడు పని గట్టుకుని, ఇతరుల ఇండ్లపై రాళ్ళు విసరి, దారిలో పల్లేరుగాయలు చల్లి తిట్లు తింటారు. తర్వాత చంద్రదర్శనం చేస్తారు

వినాయకుని పుట్టు పూర్వాలను గురించి పెక్కు గాథలున్నాయి :- దేవతల కష్టాలు నివారించడానికి శివుడు వినాయకుని సృష్టించినాడు. పార్వతి పసుపు ముద్దకు ప్రాణం పోయగా ఏర్పడినవాడు వినాయకుడు. శివపార్వతులు గజేంద్రరూపంతో కలియగా పుట్టినవాడు గజాననుడు. ఈశ్వరుని చూడడానికి వచ్చిన పరశురాముని అడ్డగించగా జరిగిన పోరులో వినాయకుని ఒక కొమ్ము విరిగినది. కనుక ఏకదంతుడైనాడు.- ఇట్లే ఎన్నో గాథలున్నాయి.

వినాయకుడు విద్యాధిదేవతగాను ఆరాధింపబడుతున్నాడు. "శ్రీ గణేశాయనమః" తోనే అక్షరాభ్యాసం ఆరంభమవుతుంది. సామవేదులు ఈనాడు ఉపాకర్మ చేయడమూ వినాయకుడు విద్యాధిదేవత అనడానికి గుర్తు. వినాయకునికి గల ఆకారము, వాహనము, పూజావిధానము మొదలయిన వాటిని బట్టి వినాయకుడు పంటల దేవుడని కొందరు విమర్శకులంటున్నారు పురాణగాథలకును, ఖగోళ దృశ్యాలకును సంబంధం కల్పించడం అనాదిగా ఉన్నదని, వినాయకచవితినాడు సూర్యోదయానికి ముందు తూర్పున ఎలుక ఆకారము, దానిమీద ఏనుగు ఆకారముగల రెండు నక్షత్రముల గుంపులు ఉదయిస్తాయని, సూర్యోదయానికి ముందు ఏ నక్షత్రం ఉదయిస్తుందో ఆ నక్షత్రానికి సంబంధించిన దైవాన్ని పూజించాలని ఋగ్వేదంలో వున్నందున వినాయక పూజ భాద్రపదశుద్ధ చవితినాడే జరుపుతున్నామని ఆచార్య శ్రీ విస్సా అప్పారావుగారు తెలిపినారు ఈ వినాయక నక్షత్రము ఆరునెలల తర్వాత ఫాల్గుణ శుద్ధ చవితినాడు సూర్యాస్తమయం తర్వాత తూర్పున ఉదయిస్తుందని ఆయన తెలిపారు "శమంతకమణి గాథలోని సింహము సింహమాసము. మణి సూర్యుడు; జాంబవంతుడు సప్తర్షి మండలము. గజాసురవధ కూడ జ్యోతిర్మండల విశేషమే" అని అయన తెలిపారు.

కొందరు పాశ్చాత్య విమర్శకులు వినాయక పూజ బౌద్ధ ప్రభావంవల్ల వచ్చిందన్నారు. కాని, గణపతి అనాదిగా ఆరాధింపబడుతున్నట్టు నిదర్శనాలు ఉన్నాయి. తర్వాత బౌద్ధులు తమ వాఙ్మయంలో ఇతనికి స్థానం కల్పించి వుంటారు. ప్రాచీన కవిత అయిన గాథా సప్తశతిలో వినాయకుడు తన తొండంతో సముద్రాన్ని కొట్టి అల్లకల్లోలం చేస్తున్నట్టు వర్ణన ముంది:-

"హేలా కరాగ్రా కృష్ట
జలరిక్త సాగరం కలయన్,
జయత్య నిగ్రహ బడబాగ్ని
భృత గగనో గణాధిపతిః"

ఇదంతా పరిశీలిస్తే, బ్రహ్మచర్యదీక్ష, విద్యార్జన, బుద్ధి, పట్టుదల కావాలన్న భావము పంటల అభివృద్ధి, నక్షత్రమండల సన్నివేశం, పురాణ గాథలు మొదలయినవెన్నో సహస్రాబ్దాలుగా కలిసి ఈ పండుగ ఏర్పడివుంటుందని తోస్తుంది.

కొన్ని ప్రాంతాలలో వినాయకచవితి మొదలు తొమ్మిదిదినాలు ఈ ఉత్సవం జరుపుతారు. దీనిని గణపతి నవరాత్రోత్సవ మంటారు.

"తత్పురుషాయ విద్మహే
వక్రతుండాయ ధీమహి
తన్నో దంతిః ప్రచోదయాత్"

—:(o):—

# వామన జయంతి

వామన జయంతిని భాద్రపద శుద్ధ ద్వాదశినాడు జరుపుతున్నారు. వామనావతారము మహావిష్ణువు 5వ అవతారము. వామనుడు శ్రవణ నక్షత్ర యుక్త భాద్రపద శుక్ల ద్వాదశినాడు మధ్యాహ్నము అవతరించినట్లు పురాణములు తెలుపుతున్నాయి. భాగవతంలో ఈ కథ విపులంగా వర్ణించబడింది. బలి చక్రవర్తిని అణచివేయడానికి మహావిష్ణువు అవతార మెత్తినాడని ఈ గాథ సారాంశం.

త్రివిక్రమవిష్ణువనగా సూర్యుడేనని, అతని ప్రాతర్మధ్యాహ్నసాయంకాల గతులే మూడడుగులుగా వర్ణింపబడ్డాయని పరిశోధకులు అంటున్నారు. కేరళులు ఈనాడు 'తిరువోణ' ఉత్సవము జరుపుతారు. ఈ ఉత్సవంలో బలిపూజ ముఖ్యము. దీనిని బట్టి ఇది ప్రవాహాలు కలిగించినందుకు ఇంద్రునికి కృతజ్ఞత తెలిపే పూజగాను కొందరన్నారు.

ఈనాడు ఉదయమే నదులలో స్నానంచేసి, వామనుని ఆరాధించాలని, మరునాడు వామనవిగ్రహాన్ని శ్రోత్రియులకు దాన మివ్వాలని వ్రతగ్రంథాలు తెలుపుతున్నాయి.

—(:o:)—

# అనంతపద్మనాభ చతుర్దశి

అనంతపద్మనాభవ్రతమని, అనంతవ్రతమని ఈ పండుగకు పేర్లు. ఇది భాద్రపద శుద్ధ చతుర్దశినాడు జరుపుతారు. పూర్ణిమతో కూడిన చతుర్దశినాడు ఈ వ్రతం జరపడం శ్రేష్ఠమని ధర్మశాస్త్రకారులు అన్నారు.

ఈ వ్రతంలో ముఖ్యమైనది ప్రతిసరబంధం. భర్త భార్య ఎడమచేతికిని, భార్య భర్త కుడిచేతినికి తోరం కడుతారు. ఈ తోరం మరుసటి అనంతపద్మనాభ చతుర్దశి వరకు ఉండాలట. ఈ వ్రతం యమునా పూజతో ఆరంభమవుతుంది. ఒక కలశములో యమునను ఆవాహనచేసి, పూజిస్తారు. తర్వాత

ముగ్గుతో పద్నాల్గు పడగలుగల అనంతుని రూపం రచిస్తారు ఈ సర్పాకారాన్ని దర్భలతోను చేస్తారు. యమునా కలశాన్ని అనంత ఫణామండలంపై ప్రతిష్ఠించి పూజలు జరిపిన పిదప, ప్రతిసరం కట్టుకొని, పాతప్రతిసరం వదలివేస్తారు. ఈ ప్రతిసరానికి పద్నాలుగు ముడులు వేస్తారు. పాలలో ముంచి ఆరవేస్తారు. పూజానంతరం వ్రతకథ వింటారు. ఈ కథ సారాంశమిది:-

కౌండిన్యుడనేవాడు శీల అనే కన్యను వివాహమయ్యెను. వారు ఒకమారు ఎడ్లబండిలో ప్రయాణం చేస్తూ, ఒకచోట అనంతవ్రతం జరుపుతున్న కొందరు సువాసినులను చూస్తారు. శీల తానుకూడ వ్రతం చేసి తోరం కట్టుకుంటుంది. ఇది భర్తకు ఇష్టంలేదు. తోరం విప్పి నిప్పులో పడవేస్తాడు. శీల దానిని తీసి పాలలో భద్రపరుస్తుంది. కాని కౌండిన్యునికి కష్టాలు కలుగుతాయి పశ్చాత్తప్తుడై అనంతుని సంతోషపెట్టడానికై తపస్సు నిమిత్తం అడవికి వెళ్లతాడు. దారిలో ఆతడు చెదపట్టిన ఒక పండిన మామిడి చెట్టును, దానిమీద కూర్చున్న పిట్టను చూస్తాడు. తర్వాత దూడతోపాటు పరుగెత్తే ఆవును, పచ్చిక బీడుపై పడుకొన్న ఎద్దును, రెండు సరోవరాలను, గాడిదను, ఏనుగును చూస్తాడు. చివరకు విసిగి మూర్ఛ పోతాడు. అప్పుడు ఒక వృద్ధ బ్రాహ్మణుడు ప్రత్యక్షమై కుడి చేయి పట్టుకొని గుహలోకి పిలుచుకొనిపోతాడు. అచ్చట అనంతుడు సాక్షాత్కరిస్తాడు. కౌండిన్యుడు తాను చూచిన వాటి ఆంతర్యమేమని అడుగగా, అనంతుడు మామిడిచెట్టు విద్యాదానము చేయని బ్రాహ్మణుడని, ఆవు భూమి అని, ఎద్దు ధర్మస్వరూపమని, సరోవరాలు దానధర్మాలు చేయని కన్యలని, గాడిద క్రోధమని, ఏనుగు మదమని, గుహ సంసారమని, వృద్ధుడు తానేనని వివరిస్తాడు.

ఈ కథను సూక్ష్మంగా పరిశీలిస్తే, ఆకాశమండలి నక్షత్ర గ్రహసన్నివేశం, నాగపూజ, ఋతుపరివర్తనం, మొదలయినవాటి సమ్మేళనం ఈ పండుగ అని తోస్తుంది. భగవంతుడు అనంతకాలస్వరూపుడనే సత్యం, దక్షిణాయనంలో కనబడకపోయిన సూర్యుని గురించి ఆవేదన, ఈ పండుగ అంతర్యం. దక్షిణాయనంలో రాత్రి పాలవెల్లిపై పురుషోత్తముడు పండుకొని వున్నట్లుండడం జ్యోతిర్వేత్తలు చెప్పినదే. తోరాన్ని పాలలో ముంచడం దీనికి ఉపలక్షకం.

# మహాలయ పక్షము

భాద్రపద బహుళ పక్షాన్ని మహాలయ పక్షమంటారు. దీని చివరి అమావాస్య మహాలయామావాస్య. ఈ పక్షంలో పితృదేవతలకు తర్పణ శ్రాద్ధాలు జరపడంవల్ల పితృపక్షమనీ అంటారు. ఈ పితృపక్షంలో అన్నికులాల వారు తమ పెద్దలు మరణించిన తిథులనుబట్టి తర్పణ శ్రాద్ధకర్మలు చేస్తారు.

మహాలయమనగా గొప్ప నాశం. లేక మరణం. ఉత్తరాయణము దేవతల కాలం గనుక ఉత్తమకాలమని దక్షిణాయనము పితృకాలము, అశుభకాలమని మన పూర్వుల విశ్వాసము. కటకసంక్రమణం నుంచి ఆరంభమయ్యే దక్షిణాయనంలో వానలు, బురద, చిమ్మచీకట్లు వుండడంవల్ల అశుభమని అనుకోడంలో ఆశ్చర్యం లేదు, వారికిది మహాలయపక్షంగా తోచివుంటుంది. ఈ కష్టకాలంలో తమ పితరులను శ్రాద్ధతర్పణాదులతో సంతోషపెడితే తమకు కష్టం గడిచిపోతుందని వారు భావించి వుంటారు. అదేక్రమంగా ఆచారమైంది. అమావాస్యనాడు విశేషంగా తర్పణాదులు దానధర్మాలు చేస్తారు. భాద్రపద పూర్ణిమనాడును శ్రాద్ధం చేయాలని ధర్మశాస్త్రాలు చెబుతున్నాయి.

భాద్రపద పున్నమను "మాలపున్నమ" అని అంటారు. మాలపున్నమ అనగా మహాలయపక్ష పూర్ణిమ. ఒక విచిత్రమైన కథవుంది. జోకరయ్య అనే తెలగ యువకుడు మాలపిల్లను ప్రేమించి, తమ తెగవారికి తెలుస్తుందనే భయంతో మరణిస్తాడు. దేవలోకంలో అతన్ని ఇంద్రుడు భూలోకవిశేషాలు ఏమిటని ప్రశ్నించగా, వర్షాలు లేక జనం కష్టపడుతున్నారని జోకరయ్య అంటాడు. దానికి శక్రుడు కరుణించి వర్షాలు కురిపిస్తాడు. అప్పటినుంచి కొన్ని తెగలవారు జోకరయ్యను భాద్రపద పూర్ణిమనాడు పూజిస్తారు. దీనిని బట్టి భాద్రపద పూర్ణిమ ఇంద్రపూజ అని, ఈ జోకరయ్య శక్రశబ్దం అపభ్రంశమని గ్రహించవచ్చు. కేరళలో జరిగే ఓణం పండుగ వినాయకచవితి నుంచి ప్రారంభమై శ్రవణనక్షత్ర సహిత ద్వాదశితోను, ఆటుతర్వాత పూర్ణిమ వరకు కొనసాగడాన్నిబట్టి మాల పున్నమ ఇంద్రోత్సవమనే నమ్మవచ్చు.

కొన్ని నక్షత్రాలున్న మండలాన్ని గజవీధి అంటారు. గజవీధిలో నున్న చంద్రసూర్యుల ఛాయను గజచ్ఛాయ అంటారు. ఈ గజచ్ఛాయ సంవత్సరాని

కొకసారి భాద్రపదంలో త్రయోదశి నుండి అమావాస్యవరకు సంభవిస్తుంది. అంటే, ఇది చీకటిలో చిమ్మచీకటి అని మన పూర్వులు భావించివుంటారు. హస్తా నక్షత్రయుక్తమైన అమావాస్య గజచ్ఛాయామావాస్య, అతి ఘోరం గనుక ఈనాడుపితాళ్ళను సంతృప్తిపరచాలను నిర్ణయించారు. ఈ అమావాస్యను 'పితాళ్ళ అమాస' అని కూడ అంటారు.



# నవరాత్రోత్సవం

నవరాత్రం అంటే తొమ్మిది రాత్రులు. తొమ్మది రాత్రులు చేసే పూజోత్సవాన్ని నవరాత్రపూజ అంటారు. ఈ నవరాత్రం నాలుగు విధాలు : చైత్రపాడ్యమి నుంచి రామనవరాత్రం, దేవీనవరాత్రం, భాద్రపద శుద్ధ చవితి_ వినాయకచవితి—నుంచి గణపతి నవరాత్రం, ఆశ్వయుజ శుద్ధ పాడ్యమి నుంచి నవమి వరకు దేవీ నవరాత్రం, చైత్ర శుద్ధ పాడ్యమి నుంచి, ఆశ్వయుజ శుద్ధ పాడ్యమి నుంచి జరిపే నవరాత్రాలలో దేవీపూజ జరుపుతారు గనుగ దేవీ నవ రాత్రాలని అంటారు. ఆశ్వయుజంలో చేసే నవరాత్రాన్ని శరన్నవరా తమంటారు. దీనికే ప్రాధాన్యమివ్వబడింది. శరన్నవరాత్రంలో దుర్గను పూజించాలని పురాణాలు చెబుతున్నాయి.

ఈ నవరాత్రంలో తొమ్మిది దినాలు పూజ చేసుకోలేనివారు మూడు రాత్రులు, ఐదు రాత్రులు, ఏడు రాత్రులు, ఒక రాత్రి చేసుకోవచ్చు. మూడు రాత్రులుంటే సప్తమినుంచి, ఐదు రాత్రులంటే పంచమి నుండి, ఏడు రాత్రులంటే, తృతీయ నుంచి, ఒక రాత్రయితే, అష్టమినాడు గాని, నవమినాడు గాని పూజ చేయాలని పురాణాలు చెబుతున్నాయి.

ఈ దేవి తొమ్మిదినాళ్ళు తొమ్మిది అవతారాలెత్తింది. ఈమె పేరు మహామాయ. ఈమె పాడ్యమినాడు మహాకాళి అవతారమెత్తి మధుకైటభులను సంహరించడంలో విష్ణువుకు తోడ్పడింది. రెండవ అవతారం మహిషాసురమర్దని. మూడవ అవతారం మహాసరస్వతి. ఈమె ఫాలము నుంచి పుట్టిన చాముండ శుంభ నిశుంభులను, రక్తబీజుని వధించింది. నాల్గవ అవతారంలో నందుని ఇంట

నందగా పుట్టి కంసుడామెను చంపడానికి పైకి ఎగిరివేయగా, "నీ ప్రాణశత్రువు నందుని ఇంట్లో సుఖంగా పెరుగుతున్నాడు." అని కంసుని హెచ్చరించింది. ఐదవ అవతారంలో ఈమె పేరు రక్తదంతి, రాక్షసులను చీల్చివేయడంవల్ల ఈ పేరు కలిగింది. ఆరవ అవతారం శాకంభరి. ఒకప్పుడు వంద సంవత్సరాల కరువు ఏర్పడగా, ఈమె శాక ఫలాలు ప్రసాదించింది. ఏడవ అవతారంలో దుర్గముడు లేక దుర్గుడు అనే రాక్షసుని వధించడంవల్ల దుర్గఅయినది. ఎనిమిదవ-అవతారంపూతంగి. తొమ్మిదవ అవతారంలో అరుణుడనే రాక్షసుణ్ని భ్రమరాల-తుమ్మెదల-సాహాయ్యంతో చంపడంవల్ల భ్రమరి అనేపేరు పొందింది.

ఈ దేవీపూజ సాత్త్విక రాజస తామసాల పద్ధతిని మూడువిధాలుగా చేస్తారు. జప యజ్ఞ నిరామిష నైవేద్యాలతో జరిగేది సాత్త్వికపూజ. బలులు, సామిషనైవేద్యం కలది రాజసపూజ. జపయజ్ఞాదులు లేక సురామాంసాల నైవేద్యం కలది తామసపూజ. ప్రస్తుతం సాత్త్వికవిధానపూజకే ప్రాబల్యమేర్పడినది. ఆశ్వయుజశుద్ధ పాడ్యమినాడు దేవ్యారాధకుడు దీక్షవహించి కలశస్థాపనంచేసి, దేవీమూర్తిని దానిలో ఆవాహనంచేసి, నవమిరాత్రి వరకు దీక్షతో దేవీపూజ చేస్తాడు. ఆరాత్రితో దీక్ష పరిసమాప్తమవుతుంది. శ్రీచక్రపూజ గూడ జరుపుతారు. ఈ తొమ్మిదినాళ్లూ కన్యకాపూజ, సుమంగలీపూజ, హోమాదులతో విశేషపూజ జరుగుతుంది. దశమినాడు ఉదయం దేవీ ప్రస్థానం జరుగుతుంది. సప్తమినాడు మూలానక్షత్రంనాడు-సరస్వతీపూజ జరుపుతారు. మూలానక్షత్రం నాడు స్థాపించి, పూర్వాషాఢలో పూజించి, ఉత్తరాషాఢలో బలియిచ్చి శ్రవణంలో విసర్జనచేస్తారు. నవమినాడు లోహాభిసారికమనే కర్మ రాజులు చేయాలని హేమాద్రి తెలిపారు లోహాభిసారికమంటే, రాజచిహ్నాలను, గజాశ్వాదులను, చాప ఖడ్గాద్యాయుధాలను పూజించడం. ఇదే కొన్ని ప్రాంతాలలో ఆయుధపూజగా నవమినాడు జరుపుతారు.

దుర్గాష్టమినాడు బతకమ్మపండుగ తెలంగాణాలో ప్రసిద్ధి. బతకమ్మ, జీవనదాత్రిఅయిన మంగళగౌరి, బ్రదుకమ్మ. వివిధవిధాలయిన పూలతోను పళ్లెంలో గోపురాకారంగా పేర్చి చందమామ పాటలు, ఉయ్యాల పాటలు పాడి, గొబ్బిళ్లు తట్టి, విజయదశమినాడు ఊరేగింపుతో, పాటలు పాడుతూ వెళ్ళి నదులలోనో, బావులలోనో ఓలలాడిస్తారు. ఈ ఉత్సవవైభవం వర్ణనాతీతం.

ఈ దేవీపూజ అనాదిగా తూర్పు యూరపులోను, మధ్యఆసియాలోను, కామరూపదేశం వరకు వ్యాపించి వుండినదని చరిత్ర చెబుతున్నది.

దేవీనవరాత్రం యుద్ధపు పండుగ, రాజుల పండుగ గనుకనే విచిత్ర వేషాలువేయడం, బొమ్మలకొలువులు తీర్చడమూను. అయినా, ఆయా వృత్తుల వారు తమతమ ఉపకరణాలను పూజించడం ఆచారమయింది.

దేవీనవరాత్రోత్సవం, దేవీ అవతారాలు, పూజావిధానం, పరిశీలించగా, వర్షర్తువులో ఏర్పడిన మధుకీటక భ్రమరాది ఈతిబాధలను, మురికిని జయించడానికి ప్రకృతిదేవిని ఆరాధించడంగా తోస్తుంది.

# విజయదశమి

నవరాత్రోత్సవం తర్వాత ఆశ్వయుజ శుద్ధ దశమినాడు జరుపు పండుగ విజయదశమి. దీనిని దసరా అనీ, దశరా అనీ వ్యవహరిస్తారు. ఇది శరన్నవ రాత్రోత్సవానికి మకుటాయమానమైన పండుగ.

ఈనాడు ఉదయం ప్రజలు తలంటిపోసుకొని, నూతన వస్త్రాలు ధరించి ఇష్టదైవాన్ని కొలిచి, మృష్టాన్నాలు భుజించి, సాయంకాలం మహోత్సాహంతో మేళతాళాలతో ఊరిబయటికిపోయి, పొలిమేరదాటి, జమ్మిచెట్టును పూజించి, తిరిగి గ్రామం ప్రవేశించి, పెద్దలకు జమ్మి ఇచ్చి నమస్కరించి, ఆశీర్వాదాలు పొందుతారు. జమ్మి ఇచ్చేటప్పుడు

"శమీ శమయతే పాపం శమీ శత్రువినాశినీ,<br>అర్జునస్య ధనుర్ధారీ, రామస్య ప్రియదర్శినీ."

అనే శ్లోకం చదువుతారు. శమీపూజ, ఊరి పొలిమేరదాటడం- సీమోల్లంఘనం- ఈ పండుగినాడు అతిముఖ్యమైనవి. ఉత్తరదేశంలో రావణకుంభకర్ణుల బుట్ట బొమ్మలు చేసి ఊరేగించి, వాటిని పెద్దమైదానంలో పెట్టి కాల్చివేస్తారు. దీనిని 'రామలీల' అంటారు. పూర్వం సంస్థానాలలో-ముఖ్యంగా మైసూరులో-దర్బారులు, దసరావేడుకలు జగత్ప్రసిద్ధాలు.

ఈ దశమిని విజయదశమి అని అనడానికి కారణాలు పురాణాల్లోను, వ్రతగ్రంథాల్లోను విధవిధాలుగ ఉన్నవి రాముడు రావణుని వధించినందుకు సంతోషించిన దేవతలు దేవిని విశేషంగా పూజించారని, అందువల్ల విజయదశమి అయిందని, కనుక శాబరోత్సవం-బండు బూతులతో, విచిత్రవేషాలతో తైతక్కలాడడం - జరపాలని కొన్ని పురాణాలు చెప్పగా, ఆశ్వయుజ శుద్ధ దశమి సాయంకాలం నక్షత్రాలు ఉదయించినకాలం విజయమనబడుతుంది, ఇది సకల కామప్రదం అని జ్యోతిష గ్రంథాలు తెలుపుతున్నాయి. ఈ సమయంలో అపరాజితను పూజించాలని, సీమోల్లంఘనంచేసి, శమీపూజ జరిపాలని, దేశాంతర ప్రస్థానానికి ఇది శుద్ధ సమయమని ధర్మశాస్త్రాలు తెలుపుతున్నాయి. ఇలాటి ప్రమాణాలు చూడగా, ఇది క్షత్రియులు విజయయాత్రకు బయలుదేరే సమయానికి ఉపలక్షకంగా కనిపిస్తుంది. వానలు వెలిసిన తర్వాత నిర్మలమైన శరత్కాలం రాజుల విజయయాత్రకు అనువైనదని చెప్పనక్కరలేదు.

"అర్జునస్య ధనుర్ధారీ రామస్య ప్రియదర్శినీ" అనేశ్లోకంలోవున్నట్లు రామాయణ భారతాల సంబంధమూ సరిగాలేదు. నిజానికి రావణవధ విజయదశమినాడు జరుగలేదని ఫాల్గుణామావాస్యయందు రావణుని రాముడు వధించాడని రామాయణ వ్యాఖ్యాత అంటున్నాడు. పాండవులు జమ్మిని పూజించి తమ దాచిన ఆయుధాలను తీసుకొన్నారనడానికి ప్రమాణాలు లేవు. కనుక జ్యోతిశ్శాస్త్ర సంబంధమైన 'విజయ' పారిభాషికపదానికి రామాయణ, భారతకథలు అంటగట్టినట్లు మనం గ్రహించవచ్చు. ఏమైనను ఇది రాజుల పండుగ.

కృష్ణరాయల కాలంలో ఇది కడువైభవంగా జరిగేదని పోర్చుగీస్ యాత్రికుడు పేజ్ వర్ణించాడు. ఇది ముఖ్యంగా రాజుల దండయాత్రోత్సవమైనా, క్రమంగా నూతన కార్యారంభోత్సవంగా ప్రజలలో నాటుకొన్నది.



# దీపావళి

దీపావళి చాల ఆనందదాయమైన పండుగ. దీనిని దేశమంతా జరుపుతారు గనుక, దేశ సమైక్యోత్సవమనీ అనవచ్చు. ఇది దక్షిణభారతంలో మూడునాళ్ళ పండుగ- ఆశ్వీజ బహుళ చతుర్దశి, అమావాస్య, కార్తీక శుద్ధ పాడ్యమి. మొదటిదినం నరకచతుర్దశి, రెండవనాడు దీపావళి అమావాస్య, మూడవనాడు బలిపాడ్యమి. ఉత్తరభారతంలో ధనత్రయోదశి, నరకచతుర్దశి, దీపావళి అమావాస్య, బలిపాడ్యమి, యమద్వితీయ- అని ఐదునాళ్లు చేస్తారు.

ఈ పండుగను జరిపే పద్ధతిని వ్రతగ్రంథాలు ఇలా తెలిపాయి:- "త్రయోదశినాడు అపమృత్యు నివారణార్థం దీపాలు పెట్టాలి. దీనిని యమ దీపమంటారు. చతుర్దశి తెల్లవారుజామున నరకభయ నివారణార్థం అభ్యంగ స్నానంచేయాల; సాయంకాలం దేవాలయాలలో మఠాలలో దీపాలు వెలిగించాలి. అమావాస్యనాడు పంచత్వక్కులు- మర్రి, మామిడి, అత్తి, జువ్వి, నేరేడుచెట్ల పట్టలు- నీటిలోవేసి, నానబెట్టి, ఆ నీటితో అభ్యంగనం చేసుకోవాలి. ప్రదోష కలంలో దీపదానంచేసి, ఉల్కలను (కొరువులను) తిప్పాలి. పిదప అలక్ష్మి నివారణార్థం లక్ష్మీపూజ చేయాలి. అంతటా దీపాలు వెలిగించాలి. రాత్రి ఊరిలోని స్త్రీలు చేటలు, తప్పెటలు వాయిస్తూ, అలక్ష్మిని పారదోలి, ఇండ్ల భవంతిలో బలిచక్రవర్తిని స్థాపించి పూజించాలి పాడ్యమినాడు బలికి వుత్సవం చేయాలి. ఉదయం జూదమాడాలి. అనాడు జూదంలో జయం పొందినవారు సంవత్సరం పొడవునా విజయంతో వుంటారు. తర్వాత గోవర్ధనపూజ చేయాలి. దారిచూపడానికి మార్గపాలిని కట్టాలి. పశువులను యథేష్టంగా ఆడుకోనివ్వాలి. యమద్వితీయ భ్రాతృద్వితీయ ఆ దినం చెల్లెలి ఇంట్లో భోజనం చేయాలి.

వ్రతగ్రంథాలలో ఇట్లా వున్నా, దీపావళి పండుగతో చాల గాథలు ముడి పడ్డాయి. 1. నరకాసురవధ 2. బలిచక్రవర్తి గాథ 3. రావణ వధానంతరం రాముడు భరతునితో సమావేశం కావడం 4. విక్రమార్క పట్టాభిషేకం. నరకాసుర గాథ భారతదేశమంతటా ప్రచారంలో వుంది. లోకకంటకుడైన నరకుణ్ణి కృష్ణుడు సత్యభామా ద్వితీయుడై ఆశ్వయుజ కృష్ణ చతుర్దశినాడు రాత్రి సంహరించాడు. కనుక నరకచతుర్దశి పండుగ చేసుకొంటున్నాము. బలిచక్రవర్తిని

వామనుడు త్రివిక్రముడై మూడడుగులచే పాతాళానికి అణచివేశాడు గనుక ఈ వుత్సవం జరుపుతున్నారు. రావణవధానంతరం రాముడు లంకనుండి బయలు దేరి భరతుని కలుసుకొన్నాడు గనుక ఇది గొప్పగా పండుగ చేసుకుంటున్నాము. ఉజ్జయినిని పాలించిన విక్రమార్కుడు (క్రీస్తుకు ముందు 58 సం.) కార్తీక శుక్ల పాడ్యమినాడు పట్టాభిషేకం చేసుకొన్నాడు గనుక ఇది గొప్ప పండుగ.

ఈ కథలలో బలిచక్రవర్తి గాథ తప్ప మరేదీ వ్రతగ్రంథాలలో లేదు. టపాకాయల ప్రసక్తే అసలేలేదు. దీపదానం చేయాలని, నరకచతుర్దశితో మహా కాళరాత్రి వచ్చింది గనుక నరకనివారణార్థం, నరకంలో వున్న పితరులకు దారి చూపడానికి కొరువులు తిప్పి, దీపాలు పెట్టాలని మాత్రమే వుంది. ఇక రాముడు చైత్రశుద్ధ పంచమినాడు భరతుని చూచినట్లు రామాయణ వ్యాఖ్యాతలు తెలిపినారు. విక్రమార్క శకం ఈ పండుగ నుంచి ప్రారంభమయినట్లూ ప్రమాణాలు లేవు. కనుక ఇది పితరులను నరకవిముక్తులను చేయడానికి ఏర్పడిందే గాని, రామ, కృష్ణ, విక్రమార్కులతో సంబంధించినదికాదు; తర్వాత ఇవన్నీ చేరివుంటాయి.

కాని నరకాసుర గాథ దీనితో ముడిపడడానికి జ్యోతిశ్శాస్త్రరహస్యం ఒకటి వుంది నరకచతుర్దశినాడు తులారాశి తూర్పు క్షితిజము మీద ఉదయిస్తుంది. మేషరాశి పశ్చిమ క్షితిజంమీద అస్తమించబోతుంది. మేషరాశి కుజరాశి, నరకుడు భూమిపుత్రుడు. ఆ దినాలలో మేషరాశి సూర్యాస్తమయసమయంలో ఉదయిస్తుంది. అది అస్తమించేవరకు చీకటే. మేషరాశి పై సూర్యుడు-కృష్ణుడు. చంద్రునితో-సత్యభామతోపాటు యుద్ధానికి బయలుదేరినట్లగుపిస్తుంది. మేషరాశి పడిపోగానే కన్యారాశిపైకి వచ్చును. దీనినే పురాణకథతో కలిపినారు.

మహావీరుడు దీపావళి అమావాస్యనాడు నిర్వాణము చెందినందున ఆనాడు దేవతలు దీపమాలతో పూజించారని జైనుల విశ్వాసం గనుక వాళ్లూ దీపావళి గొప్పగా చేస్తారు.

ఈ దీపావళి మహావైభవంతో జరిగేదని పదకొండవ శతాబ్దివాడైన అరబ్ యాత్రికుడు అల్‌బెరూనీ, మొదలయిన వారు తెలిపారు. విజయనగరకాలంలో జరిగిన ఈ పండుగ వైభవాన్ని 'ఆకాశభైరవ కల్పః' అనే గ్రంథం తెలుపు తున్నది.

కార్తికపూర్ణిమనాడు దీపాలు పెట్టడం కూడ వుంది. దీనిని కౌముదీ మహోత్సవమని అన్నారు. దీపావళినాడు కుమార్తెను, అల్లుణ్ణి పిలిపించి గౌరవించడం అనాదిగా ఉంది.

—(౦)—

# తులసీ పూజ

తులసీపూజను తులసీవివాహవ్రతమని కూడ అంటారు. కార్తిక శుద్ధ ద్వాదశినాడు సాయంకాలం జరుపుతారు. కార్తికమాసం రెండవ పక్షము, మార్గశిరమాసం మొదటి పక్షము యమదంష్ట్రి అని వైద్యశాస్త్రం చెబుతున్నది. ఈ సమయంలో పెక్కురోగాలు పుడుతాయి గనుక ఆహారవిహారాది విషయాలలో జాగ్రత అవసరమని ఈ వ్రతం ఏర్పాటయివుంటుంది.

ఈ ద్వాదశినాడు స్త్రీలు ఉదయం పూజలు, భోజనమయిన పిదప సాయంకాలం తులసి కోటను- బృందావనాన్ని- అలంకరించి, దీపాలుపెట్టి, విష్ణువుతో తులసికి వివాహం చేస్తారు. దీపావళి అమావాస్య మొదలు కార్తిక పూర్ణిమవరకు వివిధప్రాంతాలలో జరిగే దీపోత్సవాలు చూడగా, ఇదీ దీపోత్సవంలో భాగమేనని, తులసి మూలిక ప్రాధాన్యం తెలుపడానికి ఈ పూజ ఏర్పడిందని భావించవచ్చు.

ఈ వ్రతకథలు పురాణాలలో పెక్కురీతులుగావున్నాయి. పూర్వం కాలనేమి అనే రాక్షసునికి తులసి అనే కన్య పుట్టింది. పరమేశ్వరుడు ఒకమారు తన చెమటబొట్టును విసరగా, అది సముద్రంలో పడి జలంధరుడనే రాక్షసుడు పుడుతాడు. తులసిని, అతడు పెళ్ళాడుతాడు. జలంధరుడు గర్వంతో స్వర్గానికి వెళ్ళి సముద్రంలో పుట్టిన కల్పవృక్షాదులను తనకు ఇచ్చివేయమని బెదిరిస్తాడు. ఇంద్రుడు ఒప్పుకోక పోగా, జలంధరుడు అతనిని తరిమి స్వర్గం ఆక్రమించుకొంటాడు. భార్యపాతివ్రత్యం భంగమయితేగాని జలంధరుడు చావడని వరం. దానిని తెలిసిన విష్ణువు జలంధరరూపంతో వెళ్ళి తులసిని మోసగిస్తాడు. ఇంద్రుడు ఆ అదనులో జలంధరుని తల నరుకుతాడు; తల తులసి ఒడిలో పడుతుంది. తులసి కోపంతో విష్ణువును రాయి కమ్మని శపిస్తుంది, అందువల్ల

విష్ణువు గండక్‌నదిలో సాలిగ్రామరూపం పొందుతాడు. విష్ణువు తులసిని చెట్టువు* కమ్మని శపిస్తాడు. ఈమె పేరు బృంద అని పద్మపురాణంలో వుంది.

ఈ కథనుబట్టి తులసి వంటి ఓషధి ప్రాముఖ్యం చెప్పడమే పూర్వుల ఆశయమని తోస్తుంది. జలంధరుడు చెమటతో పుట్టడమంటే, చెమటతో రోగాలు రావడం. తులసి పాతివ్రత్య భంగమంటే, నలిపి రసం తీయడం. విష్ణువుతో వివాహమనగా నాలుగు నెలల వర్షాకాలం తర్వాత, చీకట్ల తర్వాత, జలప్రళయం తర్వాత సూర్యునితో ఓషధులకు సంబంధం కలగడం. వీటికి ప్రతీకే తులసి పూజ.

—:(०):—

# చాతుర్మాస్యం

చాతుర్మాస్యమంటే నాలుగు నెలలు చేసేపనులు. ఒకప్పుడు, వైదిక కాలంలో సంవత్సరానికి నాలుగు నెలల ఋతువులు మూడే పరిగణించేవారు- వర్షర్తువు, హేమంతము, వసంతము- అని, వానకాలంతోనే సంవత్సరం ఆరంభ మయ్యేదని లెక్కించేవారు గనుక సంవత్సరానికి వర్షమనే పేరు వచ్చింది. ప్రతి ఋతువులోను ప్రత్యేకవ్రత కార్యకలాపాలను మన పూర్వులు జరిపేవారు.

ఈ చాతుర్మాస్యం ఆషాఢశుద్ధైకాదశితో ప్రారంభమై కార్తీకశుద్ధ ద్వాదశితో సమాప్తమవుతుంది. ఈ ఏకాదశి ప్రథమైకాదశి- ఈనాడు విష్ణువు క్షీరాబ్ధిలో శేషపర్యంకంమీద శయనిస్తాడని పురాణాలు తెలుపుతున్నాయి. ఈ వ్రతం

---

* నిత్యత్వానికి చెట్లను పూజించడం అన్నిదేశాలలోను ఉంది. 'ఫర్' చెట్టు గోపురాకారంగా పెరిగే ఒకవిధమైన సరుగుడు చెట్టు. ఇది ఎంతమంచులో నన్నా బ్రతుకుతుంది; మంచు కప్పినా కూరుకుపోయి, మంచు కరుగగనే తలఎత్తి చూస్తుంది. దానిని పూర్వం పాశ్చాత్యులు నిత్యత్వచిహ్నంగా ఆరాధించారు. ఆ ఆచారం మతం మారినా క్రిస్మస్ వృక్షంగా నిలిచింది. నేటికీ సోషలిస్టు దేశాలలో సైతము క్రిస్మస్‌పండుగనాడు ఫర్‌చెట్టు కొమ్మలను పట్టుకొని క్రైస్తవులు గంతులువేస్తూ ఉంటారు.

ఏకాదశి నుంచి గాని, కటకసంక్రాంతి నుండి గాని ఆరంభించవచ్చు. శ్రావణ మాసంలో కూరలను, భాద్రపదమాసంలో పెరుగును, ఆశ్వయుజమాసంలో పాలును, కార్తికమాసంలో పప్పుధాన్యాలను వదలాలని ధర్మశాస్త్రశాసనం. కొత్త ఉసిరిక, చింతపండు, గుమ్మడి వదలాలి.

ఈ నియమాలనుబట్టి వానకాలంలో అపథ్యాహారం మాన్పించడం, ఆరోగ్య రక్షణం ఈ వ్రతం పరమార్థమని తోస్తుంది.

బుద్ధుడు చాతుర్మాస్యవ్రతం జరిపినట్టు, వ్రతసమాప్తిలో అనుయాయులు కార్తిక పూర్ణిమనాడు గొప్ప ఉత్సవం జరుపుతున్నట్టు, దీనిని కత్తిక నక్షత్ర, కత్తికరత్తి, కత్తికభన అని వ్యవహరించేవారని, సప్తాహాలు, దీపోత్సవాలు జరిపేవారని జాతకకథలలో వుంది. ఆరోగ్యం ప్రసాదించినందుకు యక్షరాజయిన చిత్తుని పూజించేవారనీ ఉంది.

అహింసావ్రతాన్ని అతిముఖ్యంగా పాటించే జైనులు నేటికీ ఈ వ్రతం చేస్తారు. ఈ సమయంలో వీరు స్నానోత్సవమొకటి జరుపుతారు. దీనికి 'చాతుర్మాసియ మజ్జణాయ ఉస్సవ' అని పేరు.

—(:o:)—

# సుబ్బరాయషష్ఠి

పరమేశ్వర పుత్రుడైన స్కందుని కార్తికేయుడు, సుబ్రహ్మణ్యుడని, సుబ్బరాయుడని అంటారు. స్కందషష్ఠే సుబ్బరాయషష్ఠి. ఈ దినము స్కందుడు జన్మించినట్లు పురాణాలు చెబుతున్నాయి, మరికొన్ని ఈ దినమున స్కందుడు తారకాసురుని సంహరించినాడు గనుక గొప్పపండుగ అని తెలిపాయి.

స్కందషష్ఠినాడు ఉపవాసంచేసి, బ్రహ్మచారికి వస్త్రాదిదానాలు చేసి, భోజనం పెట్టి, మరునటిరోజు పారణ చేస్తారు స్కందజననకథ సంగ్రహంగా ఇది: పూర్వం తారకాసురుడు దేవతలను బాధించగా, దేవతలు బ్రహ్మను బాధలు తొలగించమని వేడుకొంటారు. "శివపార్వతులకు జనించే కుమారుడు

తారకాసురుని వధించగలడు శివుని తపస్సుకు భంగం కలిగించడానికి మన్మథుని పంపండి" అని బ్రహ్మ దేవతలకు ఉపదేశిస్తాడు. శివుడు మన్మథుని మూడవకంటి మంటతో కాల్చివేస్తాడు. కాని, తారకవధ తప్పదని శివుడు పార్వతిని పెండ్లాడినాడు. పార్వతి అతని తేజస్సు భరించలేక పోయింది. అది కిందపడగ అగ్ని గ్రహించి గంగలో వదలుతాడు. గంగ భరించలేక తీరంలోని రెల్లుదుబ్బులకు తోస్తుంది. రెల్లుదుబ్బులలో - శరవణంలో-స్కందుడు జన్మిస్తాడు. అతనిని ఆరుగురు కృత్తికలు రక్షించారు కాబట్టి కార్తికేయుడయి నాడు. పిదప దేవసేనాపతిఅయి తారకాసురుని వధించాడు.

స్కందుని ఉత్పత్తి చూడగా. ఇది ఒకప్పుడు శరత్కాలంతో, కార్తిక మాసంతో ప్రారంభమయిన సంవత్సరాదిగాను, కృత్తికా నక్షత్రం పిల్లలకోడివలె ఆరు నక్షత్రాలు గుంపు గనుక చంద్రుడు కృత్తికలో వున్నప్పుడు అనగ కార్తిక మాసంతో ఆరంభమయిన సంవత్సరానికి ఆరు ఋతువులు ఏర్పడిన పద్ధతిగాను, తోస్తుంది. కృత్తికకు దక్షిణాపథంలో ఉన్న ప్రాధాన్యాన్నిబట్టి కూడ ఇది ఒకప్పుడు సంవత్సరాది అయివుంటుందని తోస్తుంది.

స్కంద, శివ, వాసుదేవ విగ్రహ పూజలు మనదేశంలో రెండువేల సంవత్సరాల ముందునుంచే వున్నట్టు "జీవికార్థే చాపణ్యే" (౫-౩-౯౯) అనే పాణిని సూత్రవ్యాఖ్యలో పతంజలి తెలిపినాడు.

---

# వైకుంఠ ఏకాదశి

వైకుంఠ ఏకాదశిని ముక్కోటి ఏకాదశి అని కూడ అంటారు. ఏకాదశి అంటే పదకొండవ తిథి. ప్రతినెలలో రెండు పక్షాలలో రెండు ఏకాదశులు వస్తాయి ఏకాదశులలో హరికీర్తనము ప్రధానంగా చేయబడుతుంది కనుక దీనికి హరివాసరమనే పేరు వచ్చింది.

శిష్టులు ఏకాదశీవ్రతాన్ని కఠినంగా ఆచరిస్తారు. దశమి రాత్రి ఉపవాసం ఉండి. ఏకాదశి పూర్తిగా ఉపవాసంచేసి, ద్వాదశినాడు ఉదయం పారణ చేస్తారు.

అసమర్థులయినవారు ఫలాహారమో, పాలో పుచ్చుకోవచ్చు. ఏకాదశీవ్రతమాహాత్మ్యం గురించి రుక్మాంగద, అంబరీష చరిత్రాదులు ఎన్నో పురాణగాథలున్నాయి. ప్రతినెలలో ఏకాదశులకు పేర్లున్నాయి. ఆషాఢశుద్ధ ఏకాదశి ప్రథమైకాదశి. దీనినే శయనైకాదశి అంటారు. విష్ణువు శేషతల్పంపై శయనిస్తాడు. దక్షిణాయనం ప్రారంభమవుతుంది గనుక సూర్యుడు దక్షిణానికి జరిగినట్లు కనిపిస్తాడు. ఆషాడబహుళైకాదశి కామికైకాదశి; శ్రావణ శుద్ధైకాదశి పుత్రైకాదశి; బహుళైకాదశి అజైకాదశి. భాద్రపదంలో మొదటిది పరివర్తనైకాదశి. ఈనాడు విష్ణువు పక్కకు పొర్లుతాడు; రెండవది ఇంద్రైకాదశి. ఆశ్వీజంలో పాపాంకుశైకాదశి, రమైకాదశి. కార్తికంలో మొదటిది ప్రబోధిన్యేకాదశి; దీనినే ఉత్థానైకాదశి అంటారు. ఈనాడు విష్ణువు మేల్కొంటాడు. అంటే సూర్యుడు ఉత్తరాయణం సమీపిస్తాడన్నమాట. రెండవది ఉత్పత్తికైకాదశి. మార్గశిరశుద్ధైకాదశి మోక్షైకాదశి. దీనినే వైకుంఠైకాదశి అంటారు. బహుళైకాదశి విమలైకాదశి, దీనినే సఫలైకాదశి అంటారు. పుష్యంలో మొదటిది నందైకాదశి, రెండవది కల్యాణ్యేకాదశి, మాఘంలో మొదటిది భీష్మైకాదశి, రెండవది జయైకాదశి. ఫాల్గుణంలో మొదటిది ధాత్ర్యేకాదశి, రెండవది సౌమ్యేకాదశి. చైత్రంలో మొదటిది దమనైకాదశి, రెండవది బహులైకాదశి. వైశాఖంలో మొదటిది మోహిన్యేకాదశి, రెండవది సిద్ధైకాదశి. జ్యేష్ఠంలో మొదటిది త్రివిక్రమైకాదశి, దీనినే నిర్జలైకాదశి అంటారు; రెండవది యోగిన్యేకాదశి.

ఈ ఏకాదశుల పేర్లను– శయనైకాదశి, పరివర్తనైకాదశి, ఉత్థానైకాదశి, వైకుంఠైకాదశి విమలైకాదశి, మొదలయిన వాటిని పరిశీలించగా, ఇవన్నీ సూర్యచారానికి సంబంధించినట్టు స్పష్టమవుతాయి. సూర్యపర్యాయాలన్నీ తర్వాత విష్ణువుకు అన్వయించడంవల్ల, విష్ణుప్రాధాన్యాన్నిబట్టి ఇది హరివాసరమయింది. వైకుంఠఏకాదశి ప్రధానం కావడానికి కారణమిది:-

ఈ ఏకాదశి నాటికి దాదాపు ఉత్తరాయణం ప్రారంభమవుతుంది. ముప్పది మూడు కోట్లదేవతలూ ఈనాడు భూలోకానికి దిగివస్తారని పెద్దలంటారు. అంటే, దేవతలకు మన ఆరునెలలు పగలు, ఆరునెలలు రాత్రికదా. దక్షిణాయనమనే రాత్రి తొలగి ఉత్తరాయణమనే పగలు ప్రారంభం కానున్నదన్నమాట. దీనికి సూచనగా విష్ణ్వాలయాలలో ఉత్తరాన ఒక ద్వారం తెరుస్తారు. తెల్లవారుజామున

దేవదర్శనానికి ఈద్వారం గుండా పోవాలి. వారికి మోక్షం తప్పదు. సూర్యుని ఉత్తరాయణప్రవేశ చిహ్నంగా ఈ వైకుంఠద్వారం తెరవడం ఆచారమయింది.

శ్రీవైష్ణవాళ్వారులలో ఒకరైన నమ్మాళ్వారు ఈనాడు పరమపదించడం వల్ల కూడ వైష్ణవులు దీనికి విశేషప్రాధాన్యం ఇస్తున్నారు.

---

# మకరసంక్రాంతి

మకరసంక్రాంతిని సంక్రాంతి పండుగ అంటారు. ఈ సమయానికి మనకు పంటలు పండి. ఇంటికువచ్చి, సమృద్ధిగా వుంటుంది గనుక పెద్ద పండుగ అంటారు. శ్రీనాథుడు దీనిని 'పెనుబండువు' అన్నాడు. పరిశ్రమోపజీవులైన మన పూర్వులు తాము పండించుకొనిన పంటలను విజయోత్సాహంతో పొంగించి వండుకొని, పంచభూతాలను తనియించి. తామును తనిసి, చలిమంటల వెలుగులో గొబ్బిళ్ళు, గొండ్లి ఆడి మైమరచిన పండుగ ఇది.

ఇది మార్గశిర పుష్యమాసాలలో సూర్యుడు మకరరాశిలో ప్రవేశించినప్పుడు, ఉత్తరాయణం ప్రారంభంతో వస్తుంది. ఇది మూడు నాళ్లు జరుపునట్టి పండుగ. మొదటి దినము భోగి పండుగ. రెండవనాడు సంక్రాంతి. మూడవనాడు కనుము. ఇవి మూడూ మన ప్రాచీనాచారాల ప్రతీకలే. మకరసంక్రమణం వెనుకటినెలంతా ధనుర్మాసం. దీనికి పండుగ నెల అనిపేరు. ధనుర్మాసం ముప్పదినాళ్లూ భక్తులు తెల్లవారుజామునన లేచి స్నానాదులు నిర్వర్తించి, దైవారాధనం ముగించి. వైష్ణవులైతే ఆండాళు రచించిన తిరుప్పావై పాశురాలు దినానికొకటిగా పాడి అర్చించి, భజనలతో గ్రామ ప్రదక్షిణంచేస్తారు స్త్రీలు ఇంటి ముంగిళ్లను ముగ్గులచే అలంకరించి పేడముద్దలతో గొబ్బెమ్మలు పెట్టి వాటిలో గుమ్మడిపూలు చెక్కుతారు. భోగి పండుగనాడు ఇండ్ల ముంగిట్లో మంటలువేసి, పాత వస్తువులను కాల్చి వేస్తారు. వీటికి భోగిమంటలనిపేరు. దీనిని ఉత్తరభారతంలో 'లోడి' అంటారు. మధ్యాహ్నం పులగం- పొంగలి వండి భుజిస్తారు. స్త్రీలు సాయంకాలం పిల్లలకు పండ్లు పోసి పేరంటం చేస్తారు. రెండవనాడు సంక్రాతి. ఈనాడు తర్పణ శ్రాద్ధాదులు జరిపితే, పుణ్యలోకాలు వస్తాయని. ఈనాడు నాస్తి యనే శబ్దం

వుండరాదని, దానాలు చేయాలని ధర్మశాస్త్రాలు చెబుతున్నాయి. ఈనాడు సజ్జలు నూవులు పండే ప్రాంతాలలో నూవులు అద్దిన సజ్జరొట్టెలు చేసి ఆరగిస్తారు. ఉత్తరదేశంలో కంబళ్లు దానం చేస్తారు. సాయంకాలం చిన్నవారు పెద్దవారికి నమస్కారాలుచేస్తారు. కనుక దీనికి మొక్కుల పండుగ అనే పేరూ వుంది. మూడవనాటి కనుము పండుగ పూర్తిగా కర్షకులపండుగ. తమ కృషికి బాసటగా నిలిచిన పశువులను కడిగి అలంకరించి, కొమ్ములకు రంగులు పూసి, సింగారిస్తారు. పసుల కొట్టంలో పొంగలి వండి, అది ఉడుకుతున్నప్పుడు 'పాల పొంగలి, పసుల పొంగలి' అని కేకలువేసి, దేవతలకు నైవేద్యం పెట్టి, పొలాలకువెళ్ళి ఆ పొంగలిని పసుపు కుంకుమలతో కలిపి వెదజల్లుతారు. దీనిని 'పొలి చల్లటం' అంటారు. ఇది పూర్వపు రక్తసిక్తాన్న బలికి గుర్తు తర్వాత దిష్టితీసి గుమ్మడికాయను పగులగొడుతారు. ఇదిపశుబలికి ప్రత్యామ్నాయం సాయంకాలం పశువులను పూలదండలు, నగలు, గజ్జెల పట్టెడలతో అలంకరించి వూరేగిస్తారు. చక్కెరపొంగలి తినిపిస్తారు. పొలిమేరల్లో ఎడ్ల పోటీలు, పొట్టేళ్ళ పోటీలు, కోడిపందేలు జరుగుతాయి. గంగిరెద్దులవారి సంబరం చెప్పనక్కరలేదు. తమిళనాడులో ఎడ్లకొమ్ములకు డబ్బులు కట్టి పరువెత్తించి, వాటిని విప్పుకొని వచ్చే పోటీలు జరుపుతారు. నాల్గవనాడు ముక్కనుమును జరుపుతారు.

స్త్రీలు భోగినాటినుండి గొబ్బిగౌరీ వ్రతమనే వ్రతం జరుపుతారు. భోగినాటి సాయంకాలం మంటపాన్ని నిర్మించికూరగాయలతో, పండ్లతో అలంకరించి బంకమట్టితో గౌరీవిగ్రహంచేసి, పూజానంతరం పాటలుపాడి గొబ్బిళ్లుతట్టి పేరంటం చేస్తారు. రాత్రి దేవిని నిద్రపుచ్చి, మరల ఉదయం మేల్కొల్పుతారు. నాల్గవదినం ఉద్వాసనచేస్తారు. మంటపాన్ని అలంకరించిన కూరగాయలతో కూర వండుతారు దీనిని గొబ్బి అంటారు నాల్గవనాటిసాయంకాలం గొబ్బిగౌరిని చెరువులో గాని, నదిలోగాని ఓలలాడిస్తారు కొందరు స్త్రీలు పుట్టినింటి క్షేమంకోసం "కాకిపిడచలు పెట్టడం" అనే వ్రతంచేస్తారు. కొన్ని ప్రాంతాలలో భోగి నుంచి పదినాళ్లు బొమ్మల కొలువు పెడుతారు, దీనిని సంక్రాంతి కొలువు అంటారు.

ధనుర్మాసంలో పొంగలి వండడం వైద్యశాస్త్రం ప్రకారం ఆచారమయింది. చలికాలంలో రాత్రులు పెద్దవి, పగళ్లు చిన్నవి గనుక, నిద్రలేవగనే ఆకలి అవుతుంది గనుక ముద్గాన్నం తినమన్నారు. ఈ ఆచారం దేవాలయాలలో

ప్రాకింది. భోగి అనేది సంస్కృత పదంగా కనిపిస్తుంది గాని, నిజానికి పొంగలి నుంచి పుట్టిందనే నా విశ్వాసం. ఈ పదవ్యవహారం ఉత్తరదేశంలో లేనందున, ఇది పొంగించు, పోగు అనే సంస్కృతేతర పదాల నుంచి పుట్టి బోగి అయి, సంస్కృతీకరింపబడి భోగి అయివుంటుంది

## రథసప్తమి

రథసప్తమి పండుగ మాఘశుద్ధ సప్తమినాడు జరుపుతారు. షష్ఠినాడు రాత్రి ఉపవాసంచేసి, సప్తమినాడు అరుణోదయానికి ముందే నదిలో దీపం వదలి, స్నానం చేయాలి. స్నానం చేసేటప్పుడు ఏడు జిల్లేడాకులు, ఏడు రేగాకులు తలపై పెట్టుకోవాలి.

"జనని త్వంహి లోకానాం, సప్తమీ సప్త సప్తికే,
సప్తవ్యాహృతికే దేవి, నమస్తే సూర్యమాతృకే"

అనే మంత్రంతో సూర్యునికి అర్ఘ్యమివ్వాలి. సూర్యునికి పొంగిళ్లు, చిమ్మిలివంటి పదార్థం వండాలి- అని వ్రతగ్రంథాలు చెబుతున్నాయి. దీనిని ఉత్తరాయణ పుణ్యకాలమంత ప్రముఖంగా భావిస్తున్నారు. దీనిని బట్టి, సూర్యమాతృకే, సూర్యునితల్లీ- అనడాన్నిబట్టి, సూర్యుడు ఈనాటికి కొద్దిగా రథంలాగ కనిపిలచి వుంటాడని, కనుకనే సూర్యుని కనే తల్లి అని వర్ణించబడిందని, ఇది సూర్యారాధనోత్సవమని మనం విశ్వసించవచ్చు. ఈనాటి నుంచి చలి తొలంగి, వెలుతురు ఎక్కువవుతుంది. కనుకనే శ్రీనాథుడు "మెరయు వేసవి రథసప్తమి దివసమున" అని అన్నాడు.

# మహాశివరాత్రి

మహాశివరాత్రి మాఘ బహుళచతుర్దశినాడు ఆచరించబడుతున్నది. ఇది ఈనాడు ప్రధానంగా శివభక్తుల పండుగ. ఈనాడు శివభక్తులు తెల్లవారుజాముననే లేచి, స్నానాద్యనుష్ఠానాలు నిర్వర్తించి, ఉపవాసంచేసి, రాత్రిపన్నెండు గంటలకు లింగోద్భవకాలం గనుక రాత్రంత పూజలు అభిషేకాలు, అర్చనలు, శివలీలా కథనములు జరిపి, మరుసటి ఉదయం పారణ చేస్తారు. శివక్షేత్రాలలో ఈ వుత్సవం గొప్పగా జరుగుతుంది. శ్రీశైలంలో పూర్వం ఈ వుత్సవం జరిగే తీరును పాల్కురికి సోమనాథుడు పండితారాధ్యచరిత్రలో విపులంగా వర్ణించాడు.

ఈనాటి మహిమను గురించి లింగపురాణాది శైవపురాణాలలో మృగ వ్యాధ కథలు మొదలగునవి ఎన్నో ఉన్నాయి. నాకు చూడగా ఇది సృష్టిలింగో ద్భవ కాలమని, వసంతలింగోద్భవ కాలమని, తర్వాత శైవకథలు దీనికి అను సంధింపబడినవని తోస్తుంది. వసంత విషువత్తు మృగశీర్ష నక్షత్రంలో వచ్చే కాలానికి ఇది సూచకమయి వుంటుంది. వసంతవిషువత్తు, పెక్కు నక్షత్రాలకు మారడం "ప్రాచీన ఖగోళము" అనే గ్రంథంలో శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు విపులీకరించారు. కనుక ఇది కూడ వసంతలింగోద్భవకాలమే.

—:o:—

# హోలీ - ఫాల్గుణోత్సవం

ప్రకృతిదేవి మంచు తెరలు తొలగించుకొని కొత్తసింగారంతో సాక్షాత్క-రించినప్పుడు, ఆమెకు స్వాగతం పలుకడం భారతీయుల అనాది ఆచారం. ఈ ఆచారం ఆనందస్వరూపమే ఫాల్గుణోత్సవం-హోలీ. పూర్వం వసంత విషువత్తు ఈనాడే సంభవించడంచేత వైదికకాలంలో నూతన వర్షం ఈనాడే ప్రారంభంకావడం చేత దీనికి వసంతోత్సవమని, మదనోత్సవమని వ్యవహారం వుంది. ఇది ఆంధ్రదేశంలో, కాముని పున్నమగాను, కన్నడ ప్రాంతంలో కామ దహనంగాను వ్యవహరింపబడుతున్నది. ఇది కామ పునరుజ్జీవనంగా ఏర్పడినదని

'హోహో' అనే అరపులే హోలీగా మారిందని పండితులంటారు గోధుమపంట నూర్పిడి కోలాహలమే ఇది అని కొందరన్నారు.

ఈ పూర్ణిమనాడు ప్రతిఇంటిముంగిట ఒక గుంట తవ్వి దానిలో ఆముదపు కొమ్మ నాటుతారు. గడ్డిగాదం, పిడకలు దానిచుట్టూ పోగుచేస్తారు. హోలీ, హోలిక అనే దేవతను పూజించి, చేతివెనుక భాగంతో నోరు కొట్టుకుంటారు. గడ్డి గాదం కాల్చిన బూడిదను, వసంతం బుక్కా పిండి చల్లుకుంటారు. బండ బూతులతో తిట్టు కుంటారు. ధూళిచిమ్ముకుంటారు. దీనినిఉత్తరదేశంలో'ధులండీ' అంటారు. స్నానా నంతరం పూర్ణపు బొబ్బట్లు చేసి, హోలికాగ్ని-గడ్డి గాదం కాల్చిన నిప్పు-లో వేసి హోమం చేస్తారు.

ఇది వసంతోత్సవం గనుక అతిప్రాచీనకాలం నుంచి జరుపబడుతున్నది. గాధా సప్తశతిలో దీనిని ఫగ్గుచ్ఛణం అని చాలచోట్ల వర్ణించారు. ఈ వుత్సవంలో బురద చల్లులాడడం కూడా విరివిగా వర్ణించబడింది. బుద్ధుని కాలంలో దీనిని 'బాలనక్షత్ర' అన్నారు. ఇది శ్రావస్తిలో జరిగేదట. దీనిని 'మూర్ఖుల పండుగ' అనవచ్చు. ఇది ఏడురోజులు జరిగేది. ఇది చాల ప్రబలంగా వుండడాన్నిబట్టి మీమాంసకులు దీనిని వైదికంగా పరిగ్రహించిరి. విజయనగర సమ్రాట్టులకాలంలో ఇది గొప్పగా జరిగేది.

పూర్వుల ఆనందోత్సవంగా మనదేశంలో వున్న ఈ వుత్సవం వంటివి విదేశాలలోను వున్నాయి.

—:o:—

## ఈ రచనకు తోడ్పడిన ఆధార గ్రంథాలు

సంస్కృతం —

గాథాసప్తశతి,

చతుర్వర్గ చింతామణి - హేమాద్రి

ధర్మసింధు - కాశీనాథోపాధ్యాయుడు

నిర్ణయసింధు - కమలాకరభట్టు

వ్రతచూడామణి,

స్మృతి కౌస్తుభం - అనంతదేవ

**తెలుగు** —

ఆంధ్రుల సాంఘికచరిత్ర

హిందువుల పండుగలు - సురవరం ప్రతాపరెడ్డి

గణేశ్వరీయపీఠిక - నిడుదవోలు వేంకటరావు

ప్రాచీన ఖగోళము - వేలూరి శివరామశాస్త్రి

వ్యాసావళి - విస్సా అప్పారావు

హిందువుల పండుగలు, పర్వములు - తిరుమలరామచంద్ర

పాతూరి సుబ్బరాయశాస్త్రి వ్యాసాలు,

రాళ్ళపల్లి గోపాలకృష్ణమాచార్యులవ్యాసాలు

గన్నవరపు సుబ్బరామయ్య వ్యాసాలు

ఇంకను

పెక్కు హిందీ, ఇంగ్లీషు గ్రంథాలు

—:o:—

# దేశభాషలందు తెలుగు లెస్స








ప్రపంచ తెలుగు మహాసభలు

*1975 ఏప్రిల్ 12 — 18*